# జటాయువు ధర్మబోధ






ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# జటాయువు ధర్మబోధ

This Book is Published with the Financial Assistance of
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
UNDER THEIR SCHEME
"AID TO PUBLISH RELIGIOUS BOOKS"

డా॥ ఆదవాని హనుమంతప్ప

కార్తికేయ పబ్లికేషన్స్
అనంతపురం.

JATAYUVU DHARMABODHA

By

Dr. Adavani Hanumanthappa, Research Associate
Sri Krishnadevaraya University,
Anantapur-515 003.

ప్రథమ ముద్రణ : **1995**

ప్రతులు : **1000**



ప్రతులకు :

శ్రీమతి ఎ. వెంకటేశ్వరి ప్రసూన, ఎం.ఏ.,
5-29, న్యూ ఇంజనీరింగ్ కాలేజి,
అనంతపురం - 515002.

వెల : రూ. **35/-**

ముద్రణ . శ్రీలక్ష్మి గణపతి ప్రింటర్స్, మునిసిపల్ కాంప్లెక్స్,
**5/1** బ్రాడీపేట, గుంటూరు.

# సమర్పణం

సాహితీ మిత్రులు

సహృదయులు

సాహిత్య, విద్యా పోషకులు

ఉదారులు

ఉత్తములు

జాతీయ అవార్డు గ్రహీత

ఉన్నత శిఖరాల నందుకున్నవారు

బాలాజీ విద్యాసంస్థల అధినేత

మాన్యశ్రీ **పల్లె రఘునాథరెడ్డి గారికి**

M Sc , M Phil

ప్రేమ విశ్వాసాలతో

ఈ "జటాయువు దర్మబోద"

హృదయపూర్వకంగా - అంకితం

# జటాయువు ధర్మబోధ



కృతి స్వీకర్త

**మాన్యశ్రీ పల్లె రఘునాథరెడ్డి** M Sc , M Phil ,

*బాలాజీ విద్యాసంస్థల అధినేత*

**అనంతపురం**

# విషయసూచిక

# కృతజ్ఞతలు

ఈ గ్రంథం ముద్రణకు ఆర్థిక సహాయమందించిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణ మండలికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

సాహిత్య విమర్శలో భ్రమర కీటక న్యాయాన మమ్ముల నింతవారిని చేసిన పూజ్యులు ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు గారికి నమస్సుమాంజలి.

పక్షిరాజు ధర్మబోధ గురించి చెప్పిన మా మాష్టారు పూజ్యులు ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద గారికి. శుభాశంసన తెలిపిన పూజ్యులు ఆచార్య శలాక రఘునాథశర్మగారికి ప్రణామాలు.

ఈ గ్రంథాన్ని ముచ్చటగా ముద్రించి సకాలంలో నాకు అందించిన శ్రీ లక్ష్మి గణపతి ప్రింటర్స్ అధినేతలు, అందులోని సిబ్బందికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని ఆవిష్కరించటానికి అంగీకరించిన గౌరవనీయులు శ్రీ వి. ప్రభాకర చౌదరి గారికి కృతజ్ఞతలు.

—ఎ. హనుమంతప్ప

శ్రీ సద్గురు నిలయం,
గురువారం,
13-7-1995.

ఆచార్య శలక రఘునాథశర్మ
తెలుగుశాఖ, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపురం.

# శుభాశంసన

చి॥ డా. అగవాని హనుమంతప్పలో ఒక మంచి వ్యసనం ఉన్నది అనేక గ్రంథాలు చక్కగా చదవకుండా, చదివిన దానిని గూర్చి కొంత లోచూపుతో వ్రాయకుండా అతడు ఉండలేడు. ఆ వ్యసన ఫలితంగా ఇప్పటికే అతడు పరిశోధన రంగంలో పరిణతిమార్గంలో పయనిస్తున్నాడు. అందులో వెలుగు చూస్తున్న మరొక గ్రంథం 'జటాయువు ధర్మబోధ'.

కల్పవృక్షం జోలికి పోవాలంటే గుండె దమ్ము చాలా ఉండాలి. విశ్లేషణ చేయాలంటే విశిష్టమైన ప్రజ్ఞ మరింతగా ఉండాలి. దానికి ఒక అక్షరాకృతి కల్పించాలంటే ధైర్యసాహసాలు సమున్నత స్థాయిలో ఉండాలి. డా॥ హనుమంతప్పలో ఆర్భాటం లేకుండా ఇవన్నీ తగు ప్రమాణంలో ఉన్నాయి. దానికి ఈ చిఱు పొత్తం సాక్ష్యం.

అతని అనుశీలనలో వైవిధ్యం ఉంది. లోచూపు ఉన్నది. దర్శించిన దానిని స్పష్టంగా తెలియజెప్పగల వాక్పటిమ ఉన్నది. కనుకనే అతడు శిల్పాన్ని గురించి, వృత్తాల ప్రత్యేకతను గురించి వివరించగలుగుతున్నాడు.

ఈ రచనను అతని పరిశోధన ప్రగతిలో ఒక మైలురాయిగా సంభావిస్తూ అతనిని మనసారా ఆశీర్వదిస్తున్నాను.

—శలాక రఘునాథశర్మ

ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద
ఎం.ఏ., (తెలుగు) ఎం.ఏ., (లింగ్విస్టిక్స్) పిహెచ్.డి.,
ఆంధ్రభారతి, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం.

# పక్షిరాజు ధర్మబోధ

పురాణేతిహాసాలలో పశుపక్షి పాత్రలు చాలా ప్రధానమైనవి. వాటికి భాష ఉంది. మానవులలాగానే అనుబంధాలు ద్వేషాలు ఉన్నాయి. విచక్షణా ఉంది. వాటికి సర్వశాస్త్ర రహస్యాలూ తెలుసు. అద్వితీయమైన పరాక్రమం, అసామాన్యమైన వాక్య తంత్రం, అత్యున్నతమైన జీవనధర్మ దర్శనం కలిగిన పాత్రలివి. ఒక గరుత్మంతుడు, ఒక జటాయువు, ఒక సంపాతి, ఒక పింగళకుడు, ఒక కరటకుడు, ఒక దమనకుడు - ఇలా ఏ పాత్రకు ఆ పాత్రే ఒక ప్రత్యేక జీవన సూత్రానికి వ్యాఖ్యాతగా కనిపిస్తుంది. అలా నిర్మించటం ఐతిహాసిక కవుల కథా నిర్మాణ శిల్పం.

రామాయణంలో కనిపించే జటాయువు అలాంటి ఒక చిత్రమైన పాత్ర. శబ్దాన్ని చూస్తే జటలో ఆయువు కలిగినవాడని తెలుస్తున్నా ఈ జట శబ్దం లౌకిక శబ్దం కాదని కచ శబ్దం లాగానే అది వైదిక శబ్దమేనని ఊహించవచ్చు. ఎవరి ఆయువు వేదమంత్ర పరిరక్షితమో అతడు జటాయువు. వేదం ధర్మమూలమైంది. ధర్మం సత్య ఋత రూపమైంది. వెరసి జటాయువు. ఒక యుగధర్మ పరిరక్షకుడుగా కనిపిస్తున్నాడు. అందుకే దశరథుని మిత్రుడని, పితృతుల్యుడని ఇతిహాసం చెబుతోంది.

విశ్వనాథ సత్యనారాయణగారు కవి సమ్రాట్టు కావడానికి ఎవరు ఎన్ని కారణాలు చూపినా అది పుట్టు బిరుదే తప్పా పెట్టుకు బిరుదు కాదు. విశ్వనాథ గారు ఒక స్వతంత్రమైన మహో నేత్రంతో చిత్తసంస్కారంతో సాహిత్యక్రతువులు నిర్వహించారు. ఆయన సృష్టించిన రెండు మహాగ్రంథాలు వేయిపడగలు, శ్రీమద్రామాయణ కల్పవృక్షము ఈ రెంటిలోనూ భారతదేశ ఔన్నత్యానికి దర్పణం దాంపత్య ధర్మమే అని ప్రతిపాదించాడు. జ్ఞానపీఠాన్ని అధిరోహించటానికి ఇతరులలో కనిపించని అర్హత వారిలో ఈ రెండు గ్రంథాల ద్వారానే కలిగింది. 'మానిషాద' శ్లోకంలో వాల్మీకి పొందిన ఆర్తిని కథాపరంగా పొందిన సహృదయుడు జటాయువే. అందుకే వాల్మీకి పూర్తిగా లోపలికి మునిగి జటాయువును సృష్టించాడు.

రావణుడితో జటాయువు ఇలా అంటాడు,

ధర్మశ్శుభంవా పాపంవా రాజస్యాలం ప్రవర్తతే
పాపస్స్వభావశ్చపలః కథంత్వం రక్షసాం వర.
(అరణ్యకాణ్డమ్ - పంచాశస్సర్గః (10)

ప్రధానంగా జటాయువు రాజధర్మాన్ని దాంపత్య ధర్మాన్ని పలుమార్లు బోధించాడు. సీత వద్దంటున్నా యుద్ధం చేశాడు. రావణ రాక్షస పరాక్రమం ముందు రెక్కలు తెగి నేలకూలాడు.

సీతను వెదుక్కుంటూ రామలక్ష్మణులు వచ్చారు. రాముడు కొండంత దేహంగల జటాయువును చూడగానే మానవ సహజమైన శంక పుట్టింది. ఈ పక్షి నా భార్యను తినేసిందేమో అని. ఇలా అంటాడు కూడా.

అనేన సీతా వైదేహీ భక్షితా నాత్ర సంశయః
గృధ్రరూపమిదం రక్షో వ్యక్తం భవతి కాననే—అంటూ
(సప్తషష్టితమ సర్గః—11)

జటాయువును చంపడానికి బాణం సంధిస్తాడు. అప్పుడు జటాయువు తన కథ చెప్పి 'సాదేవి మమ చప్రాణా రావణే నో భయం హృతం' అని చెబుతాడు. ఆ తల్లినీ నా ప్రాణాన్ని రావణుడే ఎత్తుకు పోయాడని జటాయువు అంటున్నాడు. తాను చేసిన యుద్ధాన్ని విరగ్గొట్టిన రావణుని రథాన్ని, చంపిన వాడి సారథిని సాక్ష్యాలుగా చూపాడు. తెగిపోయిన తన రెక్కలను తన విధి నిర్వహణకు ఆనవాలుగా చూపెట్టాడు. ఇక రాముడు సిగ్గుతో బాధతో కుంచించుకు పోయాడు. జటాయువును కౌగిలించుకొని ఏడ్చాడు. లక్ష్మణుడూ విలపించాడు. ఇదీ కథ.

మూలంలో ఉన్న ఈ మాత్రం కథను గ్రహించి పరిపూర్ణమైన ఒక కావ్య ఖండికగా మార్చటమే విశ్వనాథవారి చెయ్యి తిరిగినతనం. విశ్వనాథ సృష్టించిన జటాయువు ఊరికి పెదరాయుడు లాంటివాడు. అతని తీర్పే మనుస్మృతి. అతని పరాక్రమమే అజేయమైంది. అతను పక్షిరాజు. పక్షిగణానికే కాక సర్వ జీవరాశికి నీతి చెప్పగల గొడ్డబుద్ధి ఆయనకుంది.

సత్యనారాయణగారి పాత్రలు లోకంలోనే ఉంటూ త్రిలోకాలకు సంచారం చేస్తూ ఉంటాయి. జటాయువు రావణుని నెపంగా తీసుకొని దాంపత్య ధర్మ భంగం వల్ల రావణుడు ఎంత పాపాన్ని మూట కట్టుకున్నాడో చెబుతున్నట్టే ఆధునిక జీవితంలోని కామవిలాస ధోరణిని తీవ్రంగా గర్హించాడు.

ఇక రావణ జటాయువుల యుద్ధం. ఏ తిక్కనగారో మాత్రమే చేయగల యుద్ధవర్ణన వీరి చేతిలో మళ్ళీ అంత ప్రతిభావంతమైన చిత్రణకు నోచుకోనిది. 'రక్షః కుశీరము' అన్న మాటే వారి ఊహాలోని నవ్యతకు తార్కాణం.

వ్యాఖ్యాత డా॥ హనుమంతప్ప మా ఆంధ్రభారతి శాఖలో భాషాసాహిత్య పరిశోధనల్లో తలమునకలుగా ఉన్నవారు. ఆయన ఈ కావ్యాన్ని మా మాష్టారు ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారి ద్వారా ప్రత్యక్షంగా విని విశ్వనాధవాణి లోని నైశిత్యాన్ని ప్రత్యక్షరగతంగా అనుభవాన్ని పొందినవారు.

'కెరెయ నీరల్ కెరెగె చల్లి వరవపడె దవరంతె కాణిరో'—అని పురందర దాసు చెప్పినట్టు గురువు బోధించిన విద్యను గురువుగా మరలా బోధించటం కన్నా గొప్ప తపస్సు ఏముంటుంది—అన్న భావన ఉన్నవారు హనుమంతప్ప.

తత్త్వబోధ చెయ్యగల అర్హత వృద్ధుడైన గురువుకే ఉంటుంది. జటాయువు అలాంటి వృద్ధ గురువు. అరవై వేలేండ్లు పాలించిన దశరథుని మిత్రుడంటే అతని వయస్సు ఎంత పెద్దదో! అంత పెద్దవాడు యుద్ధం చేయటం, అతని ముందు రావణాసురుడు ఖంగు తినటం ఒక విచిత్రమైన అద్భుతానుభవాన్ని కలిగి స్తుంది. జటాయువు హనుమంతుడిలాగా పరమపూజ్యుడు. అవధూతలాంటివాడు. అందుకే సుందర పవిత్రభావ మూర్త శిల్ప భతితిలో ఈ ఖండాన్ని విశ్వనాథ తీర్చాడు. ఇందులోని పార్థక్యాన్ని పాఠకులు ఈ వ్యాఖ్యానం ద్వారా తెలుసుకో వచ్చు. రచయితకు నా శుభాకాంక్షలు.

ఈ గ్రంథాన్ని నా ప్రియమిత్రుడు విద్యారంగంలో తనదైన విశిష్టశైలిలో కృషిచేసి అతి చిన్న వయస్సులో ఏడు జాతీయ బహుమతులు పొంది బాలాజీ విద్యాసంస్థల్నీ స్థాపించి, ఎంతో మంది నిరుద్యోగ పట్టభద్రులకు జీవనభద్రత కల్గించిన శ్రీ పల్లె రఘునాథరెడ్డి గారికి ఈ "జటాయువు ధర్మబోధ"ను అంకిత మివ్వడం నాకు చాలా ఆనందదాయకమైన విషయం.

అనంతపురం, —హెచ్. ఎస్. బ్రహ్మానంద

గురువారం,

29-6-1195.

—o—

## జటాయువు ధర్మబోధ



గ్రంథావిష్కర్త

మాన్యశ్రీ **వి. ప్రభాకర చౌదరి గారు**

మున్సిపల్ ఛైర్మన్, అనంతపురం

# 1. సుందర పవిత్ర భావ సూత్న శిల్పం

1.0 విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీమద్రామాయణ కల్పవృక్ష' మన్న గ్రంథాన్ని అత్యంత రమణీయంగా మలిచారనడంలో ఏ మాత్రమూ అతిశయోక్తి కాదు. వారి పద్యరచన ధారావాహికంగా మృదు మధురంగా సాగిపోతూంటుంది. జటాయు ఖండమాధారంగా వారి కవితా శిల్పాన్ని పరామర్శించి, వారు జటాయువు యొక్క పాత్రను ఎలా మహోన్నతంగా మలిచారో ఇక్కడ ప్రదర్శించదమైనది. ప్రధానమైన కథలో ఎన్నో చిన్న పాత్రలు వస్తుంటాయి. అయితే విశ్వనాథ సత్యనారాయణగారు మలచిన చిన్న పాత్రలు ప్రధానమైన కథాప్రవాహంలో కొట్టుకుపోకుండా పాఠకుని మనస్సులో ముద్రవేసుకొని నిలబడతాయి. పాఠకుని హృదయాన్ని ద్రవీభవింపచేస్తాయి ఆ పాత్రలతో పాఠకుని మనస్సు తాదాత్మ్యం చెందుతూ ఉంటుంది. ప్రస్తుతం ఈ అనుభవాన్ని కవి మనకు జటాయువు పాత్ర ద్వారా ఎలా అనుభవింపచేశాడో ఈ పుస్తకంలో గమనించవచ్చు.

మొదట సుందర పవిత్రభావ సూత్నశిల్పాన్ని గురించి చెప్పుకొని, తర్వాత జటాయువు పాత్ర ఔన్నత్యం గురించి చెప్పుకుందాం. ఖండాంత పద్యంలో 'సుందర పవిత్ర భావ భాసురము, నూత్నశిల్పము' తన రచనలో ఉందని కవి సూచించాడు.

ఇయ్యది జటాయుఃఖండ మిందుమౌళి!
సుందర పవిత్రభావభాసురము నూత్న
శిల్పరమ్యంబు మూక్త్యాలక్షితిధవునకు
నీ కృపాదృష్టిచేఁ గీర్తి నినుచుఁగాక.

## 1.1 సుందర పవిత్రభావ శిల్పం :

ఒక భావాన్ని పవిత్రంగానూ, అందంగానూ చెప్పడం సుందర పవిత్రభావ శిల్పం. ఈ జటాయు ఖండంలో రావణాసురుని చేతకూడా సీతపై తనకుగల పవిత్రభావాన్ని (పూజ్యభావాన్ని) పరోక్షంగా భావింపజేయడంలో శ్రీ విశ్వనాథ వారు సంపూర్ణంగా కృతకృత్యులైనారు.

ఓహో! నీ సౌందర్యము
బాహిరమగు సృష్టిలోనఁ బ్రథమము నంత
ర్మోహము కదలని పూర్వపు
దేహేతరమౌ నమూర్తదీప్తియొ తెలియన్. (30)

నిజంగా కూడా సీత సృష్టిలో ప్రథమమే. 'పూర్వపు దేహేతరమౌ అమూర్తదీప్తియొ' — అనడంలో ఎంత ఔచిత్యముంది! సీత ఈ దేహాన్ని ధరించక ముందు (అవతరించక ముందు) నిజంగా అమూర్తరూపమే (అకార రహితం) కదా! ఈ విధంగా సీత రూపంలో భగవతీ స్వరూపాన్ని దర్శించినటుగా పవిత్రభావం కల్పించారు సత్యనారాయణగారు.

రావణాసురుడు సీతను చూసుకునే పద్ధతిని రాక్షస స్త్రీలకు వివరించడంలో కూడా పూజ్యభావం స్పష్టంగా కనిపిస్తుంది.

రమణీయ రత్న నీరాజనచ్ఛవులైన
తమ్మి కన్నుల నెండ తవులరాదు
తరుణబాలేందు సుందరమైన నొసలిపై
ముబ్బురేకల నీడ మసలరాదు
విమల సంధ్యానరోవీచికాభమైన
పెదవిపైఁ జలిగాలి కదలరాదు
మణిభంగవేది రమ్యకపోలముల మీద
పూదుమూరమ్ములు పోవరాదు
గంధలేపాదు లెల్ల సౌగంధ్యమంటి
మై తళుకు బీరు వోవని పూత వలయు
నఖిల భూషణ సంతతి నమరవలయుఁ
బర్వ సన్నతి సన్నుతి పర్వనట్లు. (331)

కళ్ళకు ఎండ తగులరాదట. నొసటిపై మబ్బురేకల నీడ కూడా కనిపించ కూడదు, పెదవిపై చలిగాలి సోకరాదు. చెక్కిళ్ళపై పూల పుప్పొడి కూడా పడరాదట. శరీరకాంతి వీరుపోకుండా అంటే పగుళ్ళేకాదు — తనకు (మెరుపు) కూడా పోకుండా ఎల్ల వేళల్లోనూ సుగంధాలు పూయాలట. ఇంతకంటే మించిన సేవ ఎవరు చేయగలరు. దేవతను పూజించే పద్ధతే అది మరి. ఒక రకంగా చెప్పాలంటే ఈ సేవ అంతకంటే మించిపోయింది. ఇంతకంటే చక్కటి పవిత్ర భావ మింకెక్కడుంది !

రావణాసురుడు ఆకాశమార్గాన సీతను తీసుకొనిపోయే సమయంలో జటాయు వద్దుపడి సీత అంటే ఎవరనుకున్నావు. సాక్షాత్తు లక్ష్మీ స్వరూపమే అని, దానికి నిరూపణగా సీత గౌతమీ తటానికి స్నానార్థం బయలుదేరినప్పుడు ఆ నది దేవత సీత చుట్టూ వలయాకారంగా ప్రదక్షిణ జరిపి తనకు తానే పైకిలేచి సీత శరీరాన్ని తడిపి అంజలి ఘటించిపోతుందని, అటువంటి పవిత్ర స్వరూపిణిని నీవు తీసుకుపో తగదని రావణాసురునితో సీతయొక్క పవిత్ర స్వరూపాన్ని చెప్తాడు.

**జలజాతేక్షణ గౌతమీ తటమునన్ స్నానార్థమేతేరగా**
**వలయాకార ప్రదక్షిణంబుగ నదీవార్వేణి సౌదామనీ**
**కలిత స్తంభము గాగ లేచి మునుకల్ కల్పించి నూత్నాంబుజాం**
**జలియై కానుక లిచ్చిపోవు వినయస్కన్నాంబు మర్యాదయై. (117)**

ఆ గౌతమీ నదీజలం సీత చుట్టూ గుండ్రంగా ప్రదక్షిణ చేసినట్లుగా తిరిగి, ఒక స్తంభంలాగా పైకి లేచి, సీత తలపై నీరుపోసి స్నానం చేయిస్తూ ఉంటుందిది. ఈ విధంగా గౌతమీనది తన జలంతో ఎంతో వినయపూర్వకంగా సీతపై పూజ్య భావంతో అంజలి ఘటిస్తూ ఉంటుంది అనే సంగతిని కవి జటాయుతో చెప్పించాడు.

## 1.2 నూత్న శిల్పం :

ఒక వస్తువును పోల్చేటప్పుడుగాని, ఒక భావం చెప్పేటప్పుడుగాని; కొత్త పోలికలతోనూ, కొత్తభావంతోనూ కల్పించి చెప్పటం నూత్న శిల్పమవుతుంది.

రావణాసురుణ్ని 'రక్షః కుశీరం'తో పోల్చినారు సత్యనారాయణగారు. ఏదో ఒక ఆంగ్ల చలనచిత్రంలో విచిత్రమైన జంతువు ఒకటి విశ్వనాథవారి కంటబడింది. అనేక కశాఖాలు (టెంటకిల్స్) గలిగి తన ఎదుటి జంతువునుగాని, మరి వేరొక శత్రుజంతువైన దాన్ని వాని కశాఖాలతో ఒక్కుమ్మడిగా బంధించగలిగే శక్తి దానికుంటుంది. చూడటానికి భయంకరంగా ఉంటుంది. ఆ ప్రభావంతో కాబోలు రావణాసురుణ్ని 'రక్షఃకుశీరం'గా చెప్పాడు కవి. విశ్వనాథ సత్యనారాయణగారికి మంచి దర్శక ప్రతిభతో నిర్మాణాత్మకంగా ఉన్నటువంటి, ప్రకృతి పరిశీలనతో కూడుకున్నటువంటి మొదలైన ఇంగ్లీషు సినిమాలు చూసే అలవాటు ఉండేదని ఆయనతో మెలగిన సన్నిహితులు ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారు నాకు వివరించారు.

"వ. ఓహో! రామచంద్ర ఇంతవరకు సామీప్యమ్ము చేరరాకపోయితివే! అయ్యో! నేనీ యాపత్సాగరంబున నెన్ని నిలువుల లోతు దిగఁబడి పోయితిని! యిఱువది డెక్కల వికారపు రక్షః కుశీరము నన్నుఁ గత్తిరింపబోవు చున్నది ......." (93)

ఈ 'ఇరువది డెక్కల వికారపు 'రక్షః కుశీరము' అనే ప్రయోగం పైన చెప్పినట్లుగా ఇంగ్లీషు సినిమాలోని అనేక కశాఖాలు (వీటిని టెంటకిల్స్ అంటారు) కలిగిన విచిత్రమైన జంతువును జ్ఞప్తికి తెస్తున్నది. మరి రావణాసురునికి ఇరవై చేతులు కదా! ఆ ఇరవై చేతులను కశాఖాలతో పోల్చాడు కవి. ఇది 'సూత్న'మైన పోలిక.

జటాయువు చేత-ఆకాశంలో పోతున్న రావణుడి రథం, సారథి, గాడిదలు, గొడుగులు, ధనుస్సులు అన్నీ ధ్వంసం గావింపబడ్డ తర్వాత ఒక మాను చాటుకు పరిగెత్తింది సీత. చెట్టు రెండవవైపునుంచి రాక్షసుడు సీత చీరకొంగును బలాత్కారంగా లాగుతున్నప్పుడు జరిగిన సంఘటనను చూడండి.

**మరియున్ లాగనుబడ్డ గోవు గతి రామాయంచు నెల్గియఁద**
**త్తరుశాఖాగ్ర దుఃఖిత శకుంతం బుగ్రచంచు వ్యథా**
**స్వరమై గ్రుడ్లను త్రుమ్మిక్రుమ్మికొనఁ దత్సావంబు రక్షఃకులే**
**శ్వరుపై ముద్దలు ముద్దలై పడియె రక్తస్పృత్కృతిక్రూరమై. (231)**

అదే మానుపైన ఉండే ఒక పక్షి తన చెట్టు కింద జరుగుతున్న దున్సంఘట నను చూసి తన కోపాన్ని అణచుకోలేక తన గ్రుడ్లను తానే కుమ్మికుమ్మి పొడిచింది. ఆ గుడ్ల నుంచి కారిన రసం ఆ రక్షః కులేశ్వరుని (రావణుని) పైన ముద్దలు ముద్దలుగా పడేటట్టు జేసింది. కోపంతో తన గుడ్లను తానే కుమ్మి ఆ స్రవం రాక్షసునిపై పడేటట్లు చేయడమనే భావన చాలా నూత్నంగా ఉంది. 'రక్షః కులేశ్వరు'డంటే రాక్షసరాజు అనే అర్థమున్నప్పటికీ 'రక్షః కుశీర' మనే పదోచ్చా రణకు సన్నిహితంగా ఉండే పదమైన రక్షఃకులేశ్వరుడనే పదం వాడటంలోనే కవి ప్రత్యేకత తెలుస్తుంది. అలాంటి రక్షః కుశీరంపై శకుంతపక్షి ఆ విధంగా తన కసిని తీర్చుకొన్నది.

వర్షర్తువును అమావాస్య వనవీథి పది పులుల్ కనుల
మర్షోగ్ర గర్జలు నొంటి మనిసి భీమలిన చిత్తమ్మ
నార్ష దుష్షమువేళ పటిమ అపహతావ్యక్త నక్షత్ర
శీర్షదేశోపరి సువివశితము దృష్టి ప్రసారమ్ము. (45)

పది తలకాయలు గల రావణాసురుణ్ని పది పులులతో పోల్చడం ఇక్కడ సందర్భోచితంగా ఉంది. మొదటే వర్ష ఋతువు, అమావాస్య, ఘోరారణ్యంలో ఒంటరి మనిషి – అందులోనూ పది పులుల గర్జల మధ్య మనిషి ఎంత భయానక స్థితిలో ఉంటాడో ఊహకే భయోత్పాదకంగా ఉంటుంది. ఒక పులి కాదు - పది పులులే ఉన్నాయి. నక్షత్రాల వెలుగు కూడా వర్షఋతువై మేఘావృతంగా ఉండటంతో కనిపించడం లేదు. పది పులుల కళ్ళ మెరుపుల తళుకులు మాత్రం రాత్రి పూట కనిపించటం సహజమే కదా! అలాంటి పద్యమే ఇంకోటి.

పది తోడేళ్ళు సివంగులు
కదుపుగ తన చుట్టు మూగగా నడుమ భయా
స్పదలోచన గహ్వర మృగ
సుదతి వలెన్ తిచ్చవోయి చూచెడు సీతన్. (357)

ఒకేసారి పదితోడేళ్ళు, పది సివంగులు తన చుట్టూ మూగగా అడు జింక చిత్తరవోయి చూసే రీతిగా సీత చూపులు ఉన్నాయి.

సీత మనసు మార్చుకోసం ఒక్క సంవత్సరం గడువుపెట్టాడు రావణుడు. అంత లోపల మారితే సరేసరి. ఆ లోపల మారకపోతే చీలికలుచేసి తాలింపులు పెట్టి నమలుతానన్నాడు రావణుడు (రోస్టు చేసుకొని తింటాడన్నమాట).

ఆ లోపున మారితివా
ఆలో మారెదవు మారవా! యింతింతల్
చీలికలు చేసి బ్రద్దలు
తాలింపులు పెట్టి నమలెదన్ దంతములన్. (399)

చీలికలు చేసి తాలింపులు పెట్టడం నూత్నప్రయోగం.

ఎంతోమంది అప్సరలు రావణాసురు నభినందిస్తూ ప్రేమలేఖలు పంపుతారట. ఊరకే అంపటం గాదు - వారిపై సద్దాక్షిణ్యం ప్రమోగం వల్ల వాళ్ళు ఈ రావణుడి ప్రేమకోసం తపించిపోతారని అర్థం. అంతటివాడైన నేను నీ ప్రేమకోసం తపించిపోతున్నాను సుమా అని రావణాసురుడు సీతతో వాదించే విధానం

కుద్దాలింపనుబద్ధ సంపదగగ్గోలైన వేల్పుల్ విటుల్
క్షుద్దాహంబుల రేలచెట్టు చివురాకుంబోదురౌ నచ్చరల్
సద్దాక్షిణ్యము చూపుమంచు నభిశంసాస్విన్న శృంగారభా
వోద్దీపంబులు లేఖలంపెదరు దైత్యోర్వీమహాస్వామికిన్. (25)

ఇక్కడ శృంగార భావోద్దీపనలేఖలు - అనటంలో ఆధునిక కాలపు లవ్‌లెటర్స్‌ను తలపిస్తున్నాయి. ఊరకే చివురుబోదులు అనకుండా 'రేల (రేగు) చెట్టు చివురాకుబోడు'లనటం చాలా అందమైన సమాసం. రేగు చెట్టు - చిగురాకులతో సమానమైన సౌకుమార్యం గల అప్సరసలట వారు. రేగు చెట్టు చిగురాకులు చాలా సుకుమారంగా ఉంటాయి. చాలా మృదువుగా ఉంటాయి. అల్లాంటి వాటితో పోల్చటం వింత పోలిక,

## 1.3 సంభాషణా క్రమం :

సీతను ఎట్లైనా తన వైపుకు త్రిప్పుకోవాలని రావణాసురుడు మొదట స్త్రీల సర్వసాధారణమైన మనస్థితిని జెప్పి (Generalisation చేసి), ఆ సాధారణమైన విషయాన్ని క్రమంగా సీతకు అన్వయింపజేసిన పద్ధతిని విశ్వనాథవారు కడు రమ్యంగా క్రమం కూర్చినారు.

**ఏ సన్నాసియొ పెండ్లియాడు నిక వాఁడే యంచుఁ గూర్చుందురా**
**హా! సంసారపయోధి భద్రతరులౌ సంభోజనేత్రల్ హిమా**
**నీ సంసద్గిరి కూఁతుఁ జూచితిని పై నిన్ జూచితిన్ భర్తల**
**న్నా! సన్యాసులు కొండయందుమయుఁ గాంతారంబులందీవునున్.**
**(16)**

**లోపల దాచిపెట్టెదరు లోకమునందునఁ గోర్కెలెల్ల స్త్రీ**
**లీ పరమంపు గోపనమొకింతయు నింద్రియ నిగ్రహంబు కా**
**దీ పగిదిన్ లతాంగులు మహేశ్వర! యిచ్చటనుం బరత్ర హ**
**స్తా పతితంబు సౌఖ్యమునయందు స్వవంచితలై మెలంగుచున్.**
**(28)**

**ఎవ్వరి మాటో యేమిటికి నిచ్చటఁ జూడుము నీవు భర్తయా**
**త్రైవ్విన సంపదన్ వనగతింజనగా వనవాసయోగ్యమా**
**పువ్వనుబోని నీ తనువు పుక్కిటఁ బట్టిన కమ్మగం బురల్**
**రివ్వని దూసినట్లనుసరించెను దావులు ముక్కుఁ గ్రోవులన్. (29)**

"ఏ సన్నాసినో పెండ్లిచేసుకొని వాడే నా భర్త అంటూ కూర్చుంటారు స్త్రీలు. పూర్వం పర్వతరాజు కూతురయిన పార్వతిని చూశాను, ఆ పైన (ఇప్పుడు) నిన్ను జూస్తున్నాను. భర్తల వెంట కొండల్లోనూ అడవుల్లోనూ ఉండేవాళ్ళను మిమ్మల నిద్దరినే చూస్తున్నాను (16). [సన్యాసి అనకుండా సన్నాసి అని వికృత రూపం వాడటంలోనే అవహేళన కనిపిస్తుంది. అదీ నొక్కిచెప్పడానికే ఏ

సన్న్యాసియో అన్నాడు]. ఆడవాళ్ళు వారి కోరికలన్నిటినీ లోపలే దాచిపెట్టి తమ కోరికలను బలవంతంగా అణచిపెట్టుకుంటారు. ఇలా చేయటం ఇంద్రియ నిగ్రహ మనిపించుకోదు. పరలోకం కోసం ఈ లోకంలో సౌఖ్యం పొందటంలో ఆత్మ వంచన చేసుకుంటూ బ్రతుకు వెళ్ళబుచ్చుతూ ఉంటారు స్త్రీలు (28)" అని మొదలైన రీతిగా విషయాన్ని సాధారణీకృతం చేసి చెప్పి తద్విషయాన్ని నేర్పుగా సీతకు అంటగట్టజూశాడు రావణుడు. ఎవ్వరితోటో ఏమిటికి నీమాటే తీసుకుందాం అని ఎత్తుకున్నాడు తన మాట. "ఇక్కడ చూడు! నీవూ నీభర్త ఉన్నారా! పూంఛి యౌవన సౌందర్యమంతా అడవి పాల బుంది. నీకు వనవాసమా! అడవుల్లో నువ్వు ఉండగలవా! పుష్పంతో సమానమైన సుకుమారంగల నీ శరీరం ఎట్లా తట్టుకుంటుంది! నీ తనువు పక్కటబట్టి ఉమిసినట్ల యిపోయింది. నీ తనువును వ్యర్థంచేసుకుంటున్నావు గదా" అంటున్నాడు రావణుడు.

ఈ సంభాషణాక్రమం రావణుడు చెప్పిన రీతిని కవి బాగా వర్ణించాడు. సరాసరి నేరుగా విషయాన్ని చెప్పటంవల్ల అవతలివాళ్ళు దెబ్బ (షాక్) తినకుండా విషయాన్ని క్రమానుగతంగా చెప్పటం ఒక పద్ధతి. ఆ పద్ధతిని కవి ఇక్కడ చక్కగా చొప్పించారు, 'ఏ సన్న్యాసియొ పెండ్లియాడు నిక వాడేయంచు కూర్చుందురు' అనటంలో విదేశీ సంస్కృతి ఉంది, పాశ్చాత్యదేశాల్లో విడాకులెక్కువ కదా మరి. విడాకుల మంజూరుతోపాటు భర్తలూ మారుతుంటారు. అందుకే భారతదేశ కుటుంబ వ్యవస్థపట్ల మాత్రం విదేశీయులు మెచ్చుకుంటూ ఉంటారు. అంచేత విశ్వనాథవారు విదేశీ సంస్కృతిని పరోక్షంగా రావణుని మాటల ద్వారా చొప్పించి భారతదేశ కుటుంబ వ్యవస్థ ఔన్నత్యాన్ని పరిపోషించారు.

ఇంకా సంభాషణాపై ఖరిని — అశ్వమేధయాగంలో దశరథ-జటాయువుల కలయిక (2.3), రామలక్ష్మణులకు జటాయువు (2.4) శీర్షికల కింద చూసి, ఆర్ద్రత చెందించే చక్కటి మానవీయసంబంధమైన సంభాషణను గమనించవచ్చు.

## 1.4 భూతభవిష్యత్కథా సూచకాలు :

భవిష్యత్కథా సూచకాలు కవుల కావ్యాల్లో కనిపించటం కథా నిర్మాణ శిల్పంలోని భాగమే కాని విశ్వనాథగారు గడిచిన కథను కూడా సందర్భానుగుణంగా సూచిస్తూ ఉంటారు. అందులోనూ చాలా సహజమైన రీతిలో ఆయన రచన సాగుతూంటుంది.

### 1.4.1 భూతకథా సూచకం :

సీతను అపహరించాలనే ఉద్దేశ్యంతో రావణాసురుడు మునివేషధారియై వచ్చిన సందర్భంలో ఆ ముని ఆకారాన్ని చూసి సీత ఈవిధంగా భావిస్తుంది.

మెడ క్రింద గంట్లేమి మృదుని మెప్పింపగా
దీవు వ్రతంబూను తెగువయేమొ
యెదుఱొమ్మునఁ గిణమ్ములేమి శాంభవలింగ
ఘన పరిష్వంగ సంఘటిత మేమొ
తన మూఁపు నింత వంగినయట్లు తోఁచుఁగై
లాసనాథుని బర్వు మోసెనేమొ
కరతలంబుల నింత కాఠిన్య మేటికి
శివుని రత్నాలఁ బూజించెనేమొ

కడుఁ బ్రభుత్వలక్షణమెదో కానిపించుఁ
బరమ శివభక్తి సామ్రాజ్య పట్టమేమొ
కుంభసంభవు తరువాతఁ గూడి యింత
దర్పముగలట్టి యోగి యీదారి రాఁడు. (9)

పై పద్యం రావణాసురుని గత చరిత్రను తెలియచేస్తుంది. శివుని మెప్పించడం కోసం తన కంఠాన్ని తెంపుకొన్న సంగతిని మొదటి పాదం తెలియజేస్తుంది. రెండవపాదం శివుని ఆత్మలింగం సంపాదించడంలో శివలింగాన్ని పెకలించే ప్రయత్నంలో రొమ్ముకు అయినటువంటి గాయాల మచ్చలను తెలియజేస్తుంది. మూడవ పాదం రావణాసురుడు కైలాసపర్వతాన్ని మోసిన సంగతిని తెలియ చేస్తుంది. నాల్గవపాదంలో చేతులలోని కాఠిన్యం తెల్పబడింది. ఆ వచ్చిన ముని శివుని రత్నాలతో పూజించి ఉన్నందువల్ల అతని చేతులు కాఠిన్యం పొందడానికి కారణమయ్యిందేమో అని సీత భావించింది. గీత పద్యంలో అతనిలో ప్రభుత్వ లక్షణమేదో కనిపిస్తుందని, తద్వారా రాజకళ మొహంలో కొట్టొచ్చినట్టు కనిపిస్తుం

దని సూచించారు కవి. సీత రావణాసురుని అన్ని లక్షణాలను పసిగట్టగలిగింది. అయితే అదంతా శివభక్తి సామ్రాజ్యంవల్ల కలిగిన సంతృప్తి లక్షణమని చివరికి సరిపెట్టుకోవడంతో మోసం జరిగిపోయింది. ఇలా కవి భూతకాలపు కథను సీతాదేవి ద్వారానే సూచించాడు.

కేవలం ఈ జన్మలో జరిగిన సంగతినే కాకుండా వెనుకటి జన్మలోని సంఘటనలను కూడా జ్ఞప్తికి తెప్పిస్తున్న మాటలు జటాయువుచేత కవి చెప్పించాడు.

**ఆ యమ చేతనంటు తరువంతయుఁ బూవులు కాయలౌను జా**
**యా యమ కాలుమోపు ధరయందున రత్నముద్భవిల్లుఁబో**
**ఆ యమ రామలగ్నసకలాత్మక యాయమ నిట్లు కొంచునుం**
**బోయి యవేమి త్రవ్వెదవొ? పూర్వజనుఃకృత కర్మబీజముల్.**
**(123)**

సీతను గురించి జటాయువు "ఆమె ఎలాంటిదనుకున్నావ్! ఆమె చెయ్యి తాకినంత మాత్రం చేతనే చెట్టు మొత్తం పూలు పూసి కాయలు కాస్తుంది. ఆమె కాలు మోపిన భూమిపై రత్నాలు పుట్టుకొస్తాయి. ఆమె మనస్సు ఎల్లప్పుడూ రామమయంగా ఉంటుంది. అలాంటి ఆమెను తీసుకుపోయి ఏమి పూర్వజన్మ కర్మలు తవ్వుకుంటున్నావో!' అని రావణాసురునితో అన్నాడు. పూర్వజన్మ కర్మలను తవ్వుకొంటున్నావనటం వల్ల ....ముందు వీడు (రావణుడు) వైకుంఠంలో విష్ణువు వద్ద ఉన్న జయుడనే ద్వారపాలకుడు కదా మరి! సోదరులైన జయుడు, విజయుడనేవాళ్ళు పూర్వం విష్ణువు వద్ద ద్వారపాలకులుగా ఉండేవాళ్ళు. సనక సందనాదులు విష్ణుమూర్తిని చూడటానికి వచ్చినప్పుడు ద్వారం దగ్గర ఉన్న వీళ్ళిద్దరు ఇది సమయంకాదు, కొంతసేపు ఆగండని వారిని విష్ణు దర్శనం చేయ నివ్వలేదు. స్వామి దర్శనానికి వచ్చిన మమ్మే అడ్డగిస్తారా మీరు! రాక్షసులుగా పుట్టండని మునులు వాళ్ళని శపించారు. విష్ణుమూర్తి అది తెలుసుకొని ఆ మును లకు వెంటనే దర్శనమిచ్చి జయ విజయులను రప్పించి వాళ్ళను భయపడవద్దని చెప్పి, సనకసందనాదుల వాక్యాలు తిరుగులేనివి కాబట్టి వాళ్ళ మాట తప్పదని కడపటికి వాళ్ళు తనలో ఐక్యమై తమ స్థానాలు యథావిధిగా చేరుకుంటారని చెప్పాడు. మిత్రత్వ పద్ధతిలో అయితే మీరు నన్ను చేరడం అసంభవమౌతుంది.

నా పై శత్రుత్వం పెట్టుకుంటే నేను మిమ్మల్ని తొందరగా సంహరించి నాలో ఐక్యం చేసుకుంటాను, మీకు ఏ పద్ధతి కావాలో కోరుకోండని విష్ణుమూర్తి చెప్పగా జయవిజయులు భగవంతునితో శత్రుత్వం పెట్టుకోవడానికి ఇష్టం లేకపోయినప్పటికీ మిత్రత్వంతో అయితే చాలాకాలం భగవంతుని సాన్నిహిత్యానికి దూరంగా ఉండ వలసి వస్తుంది కనుక శత్రుత్వాన్నే కోరుకున్నారు. వీళ్ళే హిరణ్యాక్ష, హిరణ్య కశిపులు; ఇప్పుడు రావణ, కుంభకర్ణులు (ఆ తర్వాత శిశుపాల, దంతవక్త్రులుగా పుట్టి శ్రీకృష్ణుని చేతిలో హతులై దైవసాన్నిధ్యం పొందుతారు). కనుక ప్రస్తుతం మన కథాంశంలోని రావణుని చూసి జటాయువు ఆవేమి వెనుక జన్మంలోని కర్మ బీజాలు తప్పుకుంటావో అనడంలో ఇంత పరమార్థమున్నదన్నమాట. సత్యనారాయణగారు జటాయువు మాటలలో చెప్పించడమనేది కేవలం కృత్రిమంగా లేదు. చాలా మామూలుగా (Casual) అన్నట్లు ఉంటుంది. అయితే అది వెనుకటి కథకు తాకుతూ ఉంటుంది. ఈవిధంగా భూతకాలపు కథను సూచించడమే కాకుండా (రావణుడి) పూర్వజన్మగాథను కూడా సూచించినట్లయింది.

**1.4.2 భవిష్యత్కథా సూచకం :**

నీవు లంక రావలయుఁ గానీ యయోధ్య
దొడ్డ దొరబిడ్డ నిజముగా గడ్డికఱచు
నీరనిధి నిప్పులూఁది మండించును గద
లిపయి కాలు తేలించు రాలేఁడ లంక. (32)

అంచిత భోగలాలసవు నప్పుడు కోరెదవేని, దృక్కళా
వంచిత పుష్పబాణశరవైభవ! సౌఖ్యమునందు నిన్ను వం
చించిన యీ రఘూత్తముని చేతను నీ మును కోతులాట యా
డించెద నీ సుఖంబు వికటించిన మందగు కామరోగిచే (76)

ఐపానవాలు తోఁపని
నా స్వామియనత్రోవ తెలియునా యాతనికిన్
వాపోయిన వాపోకఁగ
నే పుట్టంబట్టిపోవు నితని కథాశుల్. (81)

సీతను అపహరించే ముందు రావణుడు సీతను తనవైపుకు త్రిప్పుకోవడానికి ఎన్నో వంచనతో కూడిన మాటలు చెప్పాడు. ఆ చెప్పే సందర్భంలో 'కడలి పయి ఱాలు తేలించు రాలేఁడ లంక, నీ మును (నీ ముందు) కోఁతులాటయాడించెద ఏ పుటంబట్టి పోవు నితని కథాళల్' అని రావణాసురుడి నోటి వెంటే పలికించాడు కవి. కడలి (సముద్రం)పై రాళ్లు తేలిస్తేకాని నీ భర్త రాలేడు లంక అన్నాడు రాక్షసుడు. వాడు అన్నట్టుగానే తర్వాత శ్రీరామచంద్రుడు హనుమత్ సుగ్రీవాదుల కోతుల సహాయంతో నలుడు అనే వానరుడి ద్వారా రాళ్ళతో వంతెన కట్టాడు. నలుడి చేతిగుండా వేస్తే ఆ రాయి నీటిమీద తేలుతుంది. ఆ గుణం అతనికున్నందువల్ల మిగిలిన వానరులందరు రాళ్ళు తెచ్చి నలుడికిస్తారు. వాడు తన చేత్తో సముద్రం మీద రాళ్ళన్నిటిని వేసి నీటిపైన తేలేటట్లు చేసి వంతెన కడతాడు. ఈ విధంగా రాళ్ళను సముద్రంలో తేలించి వంతెనకట్టి సముద్రాన్ని దాటే కార్యం భవిష్యత్తులో జరగనే జరిగింది. నీ భర్త అయిన రఘురాముని నీ ముందు కోతులాటలాడిస్తా అన్నాడు రావణుడు. హనుమంతుడు తన తోకకు రాక్షసులు నిప్పంటించినప్పుడు ఒక ఆటలాగా లంకను సునాయాసంగా కాల్చివేశాడు. హనుమంతుడు, సుగ్రీవాదుల కోతుల సహాయంతో రావణాసురాది రాక్షసులతో శ్రీరాముడు యుద్ధం చేశాడు. కోతులాటాడిస్తానన్నాడు కదా అది భవిష్యత్తులో ఈ విధంగా నిజమయింది. 'ఏ పుట్టంబట్టిపోవు నితని కథాళల్' అన్నాడు కదా రావణుడు — ఆ తర్వాత కుశ, లవులు పుట్టను చెట్టును బట్టుకొని (అడవిలో) రామకథను పాటగా ఆలపించడం, అటుపిమ్మట పురవీధుల్లోనూ, రాజసభల్లోనూ రామకథను గానంగా ఆలపించటం మొదలైన విషయాలు భవిష్యత్తులో జరిగాయి. ఈ భవిష్యత్కథాసూచకం రావణుని నోటి నుంచే సహజధోరణిలో చెప్పించడం ఇక్కడి విశేషం.

## 1.5 మత్తేభాక్కర వృత్తాల ప్రత్యేకత :

చాలా మంది పూర్వకవులు మత్యాక్కర వృత్తాల్లో యతుల మైత్రిని పాటించటంలో 4వ గణం మొదటి అక్షరాన్ని యతిగా కుదుర్చుకున్నారు. నన్నయ గారు మాత్రం 5వ గణం మొదటి అక్షరానికి యతి చెల్లించారు. ఎఱ్ఱాప్రగడ అరణ్యపర్వశేషాన్ని నన్నయ రచన రీతిలోనే రచిస్తానని చెప్పాడు. అన్నంత

పనీ ఆయన చేశాడు కానీ మధ్యాక్కర యతి విషయంలో మాత్రం 4వ గణం మొదటి అక్షరానికే యతిమైత్రిని పాటించాడు. బహుశా 6 గణాలు (2 ఇంద్ర గణాలు 1 సూర్యగణం+2 ఇంద్రగణాలు 1 సూర్యగణం) ఉండే మధ్యాక్కరలతో 5వ గణాద్యక్షరానికి యతి చెల్లిస్తే దాదాపు పాదం చివరలో యతి చెల్లించడమేమిటని ఎర్రనకు అనిపించి 4వ గణాద్యక్షరానికి యతి చెల్లించి ఉంటాడు. విశ్వనాథ వారు భారత కవులు (నన్నయ, ఎర్రన) ఇద్దరినే గౌరవిద్దామనే ఆలోచనతో కాబోలు 4వ గణం మొదటి అక్షరానికీ, 5వ గణం మొదటి అక్షరానికి కూడా యతిమైత్రి ప్రతిపాదంలోనూ రెండుచోట్లా ప్రదర్శిస్తూ పోయారు. ఒక్క పాదంలో ఒక్కచోట యతిమైత్రి చెల్లించడానికే కవులు నానాయాతన పడుతూంటే విశ్వనాథ వారు ప్రతిపాదంలోనూ రెండుచోట్లా యతిమైత్రి పాటించడం అత్యంత అద్భుతం. యతి అనేది ఒక స్పీడు బ్రేకర్ అనుకుంటే ఒక స్పీడు బ్రేకర్‌ను దాటి పోవడమే కాకుండా తానే రెండు స్పీడు బ్రేకర్లు వేసుకొని ఆ రెంటిని అవలీలగా అధిగమించారు విశ్వనాథ సత్యనారాయణగారు. దీనివల్ల సత్యనారాయణగారికి పద్యవిద్య ఎంత కరతలామలకమో ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు కానీ చదివే కొద్దీ ఆశ్చర్యంతోపాటు ఆనందం పాఠకునికి కల్గుతూ ఉంటుంది. కవి మధ్యాక్కరలలో యతిమైత్రిని రెండు చోట్లా పాటించడాన్ని ఈ కింది ఉదాహరణల్లోని క్రీగీతల ద్వారా గమనించగలరు.

వర్షర్తువును నమావాస్య వనవీథి పది పులుల్ కనుల
మర్షోగ్ర గర్జలు నొంటి మనిసి భీమలిన చిత్తమ్ము (45)

ఈ పురుషుండు నీ స్త్రీయు నిద్దరే ఇంతియుఁ బతియు
ఏ పురుషుండు నే స్త్రీయు ఎందుకో ఏల కారాదు (237)

మా ధాత్రి నీవు రావలయు మాణిక్యమణులు పంతవలె
శోధించి యొందఱుచ్చెరల జలధిరాట్సంతతిఁ దెచ్చి (47)

విశ్వనాథవారి మధ్యాక్కరలు కావ్యంలో ఎక్కడ ఉన్నా ఇలా రెండు చోట్లా యతి ఉండటాన్ని మనం గమనించవచ్చు.

## 1.6 విశేష వృత్తాల రచనా విధానం :

ఉత్పలమాల, చంపకమాల, శార్దూలం, మత్తేభం, ఆటవెలది, తేటగీతి, కందపద్యాలు కాకుండా తక్కిన వృత్తాలు విశేషవృత్తాలు. ఈ విశేషవృత్తాలను కవులు సందర్భానుసారంగా ప్రయోగిస్తారు. ఏ ఘట్టంలో ఏ విశేషవృత్తం వాడితే అందంగా ఉంటుందో ఆ విశేషవృత్తాన్నే ఎన్నుకోవడంలోనూ, నడిపించటం లోనూ విశ్వనాథ వారిది అందెవేసిన చేయి.

సీతను బలాత్కారంగా కొనిపోయే సమయంలో కేవలం భావస్థితలు (ఆకార రహితులైన) అయిన త్రయీదేవతలు విశేషించి రావణాసురుని భావించే సందర్భంలో విషమ పరిస్థితుల్లో ఉంది కనుక ఆ సందర్భంలో విషమసీసాన్ని ఎన్నుకోవడం ఎంతో సముచితంగా ఉంది. సందర్భానుగుణంగా ఉంది.

విషమ సీసము :

వేఁడు కాంతను బలవంతపెట్టి యపహరించునో
వాఁడు సృష్టిధర్మ మర్మపథము బాహిరించెఁబో
మూఁడు గుణము లేవొ పాళ్ళుమొనసి జగము సాగినన్
వీఁడు మాత్ర మచ్చతమము వెట్టురూపు, సర్వథా
రణ శీతడు వెలుపల అణువునుగాడు, ప
దార్థమైన, దానియందు నాత్మ
పీనమైనను బ్రతిబింబించుఁ, జీఁకటి
మొదటిముద్ద వెలుగు ముట్టుకోదు. (254)

జగమంతా మూడు గుణము * (రజోగుణం, తమోగుణం, సత్వగుణం)

---

*1. సత్వగుణంవల్ల సత్యం, ఆచారం, తపం మొదలైన సద్గుణాలు కల్గుతాయి. 2. రజోగుణం వల్ల లోభం, పరద్రవ్యాది కాంక్ష కర్మాలయొక్క ఆరంభంలో శమం లేకపోవడం, కోరికలు మొదలైన గుణాలు కల్గుతాయి. 3 తమో గుణం వల్ల వివేకం లేకపోవటం, మోహం మొదలైన గుణాలు కల్గుతాయి.

లలో ఏదో ఒక గుణంతో కాసే, కొంతభాగంతో కాని పాగిపోతూ ఉంటే వీడు (రావణుడు) మాత్రం అచ్చం తమోగుణం మాత్రమే స్వీకరించి ఆరూపుతోనే క్రూర. దుష్టకృత్యాలు చేస్తున్నాడని భావం. తమోగుణమే వీని రూపమెత్తి వచ్చినట్టుగా ఉంది.

**ధరణి ధరగతి :**

> **చెదరిన తలయు చినిగిన వలువ తరిగిన మొగమై**
> **కదలిన నడుము కదిసిన యురము కల్గి తునిగిన సరమై**
> **అదరిన పిఱుఁదు నలసిన పదము నదవదలయి చను కనులై**
> **బెదరి బెదరియు విరిసి విరిసియు వెడలకు వెడలకు మగువా!**

జటాయువు ఆకాశంలో పోతున్న రావణుని రథాన్ని తుత్తునియలు చేసిన తర్వాత భూమి చేరుకున్న తర్వాత సీత దిక్కులకు పరిగెత్తిపోయింది. అప్పుడు రావణుడు తన పదినోళ్ళతో కేకలు పెట్టి అరుస్తున్నాడు. "ఓ మగువా! చెదరిన తలతో నీ చెలువం (సొగసు) తగ్గిపోయిన మొహంతో, కదలుతున్న నడుంతో, కదిసిన రొమ్ముతో, తునిగిపోయిన సరాలతో, అదురుతున్న పిరుదులతో, అలసి పోయిన పాదాలతో, వదలు వదలుగా అదురుతున్న కళ్ళతో బెదరిపోతూ నా నుంచి విడిపోయి అలా వెళ్ళకు వెళ్ళకు మగువా"! అంటున్నాడు రాక్షసుడు.

బెదరి బెదరియు అని రెండు మార్లు అనటం వల్ల మిక్కిల బెదరిపోయినట్లు గానూ; విరిసి విరిసియు అనే ఆ వృత్తివల్ల రావణాసురుడి నుంచి సీత ఎంత దూరంగా విడిపోవాలనుకుంటుందో తెలుస్తున్నది.

సీతాదేవి మొగం చెలువం (సొగసు) తరిగింది. అనగా కాంతిహీనమైంది అంటే దైన్యవదనమయిందని భావం. ధరణి ధరగతి వృత్తం వాడటం వల్ల పద్యం సర్వలఘువులతో నడచినందువల్ల సీతాదేవి యొక్క దీనస్థితిని ఈ వృత్తంలో చక్కగా తెలియజేయడమైనది. ఇక్కడ అన్నీ లఘువులే అయివందు వల్ల (చివరి అక్షరం తప్ప) పదాలు కూడా వదులు వదులుగానే ఉంటాయి.

చపలి :

అహాహా యాపద యనగా బహిర్గతము హృదయ వికృతభావంబే
ముహురావృత మోహము విధి విహారమనిపించు విశ్వసృజా !(90)

చపలి అంటే నిలుకడ లేనిది. సీత మనసు కూడా నిలకడలేని స్థితిలో ఉంది కనుక ఇక్కడ ఈ చపలి వృత్తాన్ని వాడటం గుర్తించాలి.

పద్య :

ఎప్పుడొ చేసిన కర్మంబిప్పుడు ఘటియిల్లు ననుట మృష యగునో
యిప్పుడ చేసిన కర్మంబిప్పుడ ఫలియించు ననగ ఋజు విదిగో
(86)

'పద్య' అనగా మార్గమని ఒక అర్థముంది. పాదాలను హింసించేది పద్య అని ఇంకో అర్థముంది. లక్ష్మణుడు తాను పోనని వాపోయినప్పటికీ (రాముడు మాయలేడి వెంట వెళ్ళిన సందర్భంలో), రామునికి వచ్చిన ఆపద ఏమీ లేదని చెప్పినప్పటికీ సీత పరుషంగా మాట్లాడి లక్ష్మణుని హింసించి నిష్ఠూరంతో అన్న దగ్గరకు పంపించింది. ఆ పరుషపు మాటల ఫలితమే ఇది అని సీత తనలో అనుకొంటూ ఉంది. ఇది ఒక విధంగా చెప్పాలంటే చేసిన పని (హింస)కి తిరిగి శిక్ష (హింస) అనుభవించడం లాంటిదే. ఎప్పుడో చేసిన కర్మ ఇప్పుడు అనుభవించవలసి ఉంటుంది. అని మాత్రమే కాదు ఇప్పుడు చేసిన దానికి ఇప్పుడే ఫలితం కూడా అనుభవించవలసి వస్తుంది. దానికి ఋజువుగా ఇప్పుడు లక్ష్మణుని పరుషంగా మాట్లాడి పంపించింది, తత్ఫలితంగా వెంటనే రావణాసురుడు ముని వేషంలో రావటమే. ఈ సందర్భంలో తాను మనసులో అనుభవించిన హింసను అదే అర్థం వస్తున్న 'పద్య' వృత్తాన్ని వాడటం వల్ల ఈ వృత్త మిక్కడ ప్రత్యేకతను సంతరించుకున్నట్లయింది.

మధ్యాక్కర :

ఈ పురుషుండు నీ స్త్రీయు నిద్దరే యింతియుఁ బతియు
నే పురుషుండు నే స్త్రీయు నెంచుకోయేల కారాదు
ఆ పురుషుండు నా స్త్రీయు నాదేశ మాకాల మావి
ధా పరిస్థితులును తద్విధాన సంధ్యా జీవకళలు. (287)

ఈ పురుషుడు, ఈ స్త్రీ వీరిద్దరే భార్యాభర్తలు ఎందుకు కావాలి! ఏ పురుషుడో ఏ స్త్రీయో ఎందుకు కారాదు. అంటే ఒక దేశం స్త్రీ, వేరొక దేశం పురుషుడు భార్యాభర్తలు ఎందుకు కారాదు. ఏ స్త్రీయో ఏ పురుషునితోనో ఎందుకు కాకూడదు. ఆ దేశమూ, ఆ కాలమూ, ఆ విధానమూ, ఆ పరిస్థితులూ, ఆ సంస్కృతీ అలా ఉంటుంది. సంస్కృతిని గురించి ఈ మధ్యాక్కరలో చక్కగా చెప్పటం జరిగింది. పద్యంలో 'ఆ కాలము' అనే పదం కూడా బాగా తూచి వాడినట్లు తెలుస్తుంది. కాలానుగుణంగా పరిస్థితులు మారితే కూడా మారవచ్చునని కవి సందేహం ఇక్కడ కొంచెం బయటపడుతుంది. (అలా మారిన ఉదాహరణలు కూడా అరుదుగా ప్రపంచంలో కనిపిస్తున్నాయి కదా మరి!). పలానా పరిస్థితులు పలానా విధంగా ఉండటానికి పలానా (అప్పటి) కాలం కూడా ముఖ్యమే.

**ధరణి :**

చలువల్ తరుగై వరుసల్ విరుగై
వాలికల్ తూలికల్ బాడబాకృతులై
మలకలుగొని మరియున్ విరియున్
గాలుల్ ప్రాచీదిక్ర్కాంతములై గుములై. (256)

ఈ వృత్తంలో గాలి ఏ విధంగా సుళ్ళు తిరిగి వస్తుందో చెప్ప బడింది. 'మలకలుగొని మరియున్ విరియున్' అనడంతో గాలి మలుపు తిరిగి మళ్ళీ విడిపోతుంది. ఈ పద్యం ఒక్కొక్క పాదం ఒక్కొక్క గతిలో (ఒక్కొక్క రీతిలో) నడుస్తూండటం వల్ల గాలి వెంటవెంటనే తన గతిని మార్చుకునే విధానం సహజసుందరంగా వర్ణించటానికి వీలయింది సుడిగాలికదా! ఒకే రీతిగా ఉండదు. ఒకసారి తూలి ముందుకు పడినట్లు ఉంటుంది. మరొక సారి టక్కున ఆగినట్లాగి ఇంకోసారి మలుపులు తిరుగుతుంది. దాని ఇష్టంవొద్దీ పోతుంది. వెంటవెంటనే తన గతిని మార్చుకుంటుంది కనుకనే కవి ఒక్కో పాదంలో ఒక్కోరకమైన గణాలు ఉండే ఈ ధరణీవృత్తాన్ని ఎన్నుకున్నాడు.

మొదటి పాదంలో స-స-స-స గణాలు; 2వ పాదంలో ర-ర-ర-స గణాలు: 3వ పాదంలో న-న-స-స గణాలు; 4వ పాదంలో మ-మ-న-స గణాలు ఉంటాయి. ఒక పాదంలో ఉండే గణాలు వేరొక పాదంలో ఉండవు. అలాగే యతి కూడా అంతే. ఒక్కొ-పాదంలో ఒక్కొ- రీతిగా ఉంటుంది. మొదటి పాదంలో 9వ అక్షరం; రెండవ పాదంలోనూ, మూడవ పాదంలోనూ 7వ అక్షరం నాల్గవ పాదంలో 6వ అక్షరంగా యతి కూర్చబడి ఉన్నది. మొత్తం మీద ప్రతి పాదం లోనూ చివర 'స-గణం' తప్పనిసరిగా ఉండటాన్ని గమనించవచ్చు. ప్రతి పాదంలోనూ విభిన్నరీతుల్లో గణాలు ఉన్నాయి కనుకనే సుడిగాలిని బాగా వర్ణించ డానికి ఈ వృత్తం బాగా సహాయపడింది.

పైన ఉదాహరించిన వృత్తాలే కాకుండా మత్తకోకిల, విపుల, చపల, జఘన చపల, మంజరీద్విపద, ద్విపద, త్రిపద, చతుష్పద, విరాళ చతుష్పద, కర్ణాటక చతుష్పద, పంచపది, షట్పది, నిశా, తోటకము, త్వరితగతి, పృథ్వి, శిఖరిణి, శ్రీరమణము, మనోహర, వేగవతి, పరావతి, వియోగిని, ధృతమధ్య, భుజంగ-శిశురతము, అల్పాక్కఱ, ప్రహరణకలితము, మాలిని, ఉత్సాహము, వాతోర్మి, ఖచరప్లుతము, రుగ్మవతి అనే విశేషవృత్తాలను ఈ జటాయు ఖండంలో విశ్వనాథ సత్యనారాయణగారు సమయ సందర్భానుగుణంగా నడిపించారు. వారి ప్రతి పద్యమూ సుందరమై, వినూత్నశిల్పంతో పొంగిపొర్లుతూ ఉండి ఆస్వాదించేవారికి ఆహ్లాదం గొల్పుతూ ఉంటుంది.

* * *

# 2. జటాయువు పాత్ర ఔన్నత్యం

20 రావణుడు సీతాదేవిని అపహరించేవేళ ఆమె మూర్ఛపోయింది. తిరిగి మూర్ఛ తేరుకొని చూసేటప్పటికి రావణాసురుని రథం ఆకాశాన పోతోంది, ఎవ్వరూ తనను రక్షించేవారే లేరనుకున్న సమయంలో దూరాన ఉన్న మహావృక్ష రాజాన్ని సీత చూసి తన ప్రాణాలు లేచి వచ్చినంతగా సంతోషపడింది. దానికి కారణం ఆ మహావృక్షంయొక్క కొమ్మపై 'జటాయువు' అనే పక్షిరాజు (గద్దల రాజు) కనిపించడమే. ఈయన దశరథుని మిత్రుడు. ఎవ్వరూ రాక్షసుని బారి నుంచి తనన్ను కాపాడుకునేవాళ్ళే లేరనుకున్న సమయంలో జటాయువును చూసిన తర్వాత సీత మోముపై మోదరేఖ వెలసింది. తనను కాపాడమని తాతను ప్రార్థించింది.

"వ. అంత జటాయువు నిదానించి చూచి నీవా తల్లీ! యనుచు సముద్భూత పక్షచ్ఛదాకృతి గిరిరాజు వలె లేచి రావణుని రథం బాపుమని యడ్డువచ్చి. ఇట్లనియె." (114). నిదానించి చూసి నీవా తల్లీ అనటం వల్ల ముసలి వయసులో నున్న వాళ్ళు పణ మీద (నొసటిపై) చేయి వాటంగా పెట్టి చూసి గుర్తుపట్టి నీవేనా తల్లీ! అని సంబోధించటం సహజంగా ఉంది. ఆ మహావృక్షం నుంచి జటాయువు వస్తూంటే పర్వతమే రెక్కలు కట్టుకొని వస్తున్నట్లుగా ఉందట. దీన్నిబట్టి జటాయువు ఆకార పరిమాణం ఎంత గొప్పదో పాఠకుడు ఊహించుకోవచ్చు. అందువల్ల జటాయువు రావణాసురునితో పోరు సల్పటానికి సమర్థమైనదని పాఠకుడు ఊహించవచ్చు. అంతేకాకుండా పై వచనంలో జటాయువుకు వయస్సు బాగా ఎక్కువగా ఉందన్న సంగతి తెలుస్తున్నది. తర్వాత జటాయువు కూడా రావణాసురునితో 'ఈ సృష్టి సాగినప్పటినుంచి నాకు తెలుసు' అని చెప్పుకోవటాన్ని బట్టి కూడా జటాయువు వయస్సు ఎంత సుదీర్ఘమైనదో పరిగణించవచ్చు. ఎక్కువ వయస్సు తనకుందని జటాయువు చెప్పటం ద్వారా అంత అనుభవముందని భావం. అంత అనుభవంతో చెబుతున్నాను కనుక నా మాట విను అని జటాయువు రావణునికి నచ్చచెప్తున్నాడు.

## 2.1 రావణాసురునికి జటాయువు హితబోధ చేయుట :

రావణాసురునితో రఘురాముని ఘనత గురించి చెబుతూ రాముడు నా బిడ్డ వంటివాడని నేను గొప్పలు చెప్పడం కాదు కాని రాముడు నిజంగా స్వామి, తండ్రి మాటకు బద్ధుడై అడవికి వచ్చాడు (116)" అన్నాడు.

సీతను గురించి చెబుతూ ఆమెకు ప్రకృతి స్వయంగా సేవలు చేసే ఒక విచిత్రమైన, సుందరమైన సన్నివేశాన్ని జటాయువు చెబుతున్నాడు.

జలజాతేక్షణ గౌతమీ తటమునన్ స్నానార్థమేతేరఁగా
వలయాకార ప్రదక్షిణంబుగ నదీవార్వేణి సౌదామనీ
కలిత స్తంభముగాఁగ లేచి మునుకల్ కల్పించి నూత్నాంబుజాం
జలియై కానుక లిచ్చిపోవు వినయస్వాన్నాంబు మర్యాదయై
(117)

'సీత గౌతమీనదికి స్నానం చేయడానికి బయలుదేరి నదీతీర ప్రాంతానికి చేరుకోగానే ఆ నదీజలం తనకు తానే సీత చుట్టూ గుండ్రంగా ప్రదక్షిణ చేసినట్లుగా తిరిగి ఒక స్తంభంలాగా పైకి లేసి, సీత తలపై నీరుపోసి స్నానం చేయిస్తూ ఉంటుంది - గౌతమీనది తన జలంతో ఎంతో వినయపూర్వకంగా సీతపై గౌరవ భావంతో అంజలి ఘటిస్తూ ఉంటుంది' అని చెప్పాడు జటాయువు.

ఇక్కడ సీత నదిలో మునిగి స్నానం చేయడానికి ప్రయత్నమేమీ చేయలేదు. నది దగ్గరకు వెళ్ళివెళ్ళగానే నది తనంతట తాను వలయాకారంగా ఏర్పడి సీతాదేవిపై చాలాసార్లు నీటితో ముంచింది. నిజానికి సీత మునగలేదు. జలమే పైకి లేసి మునుకలు కల్పించింది. అంటే ప్రకృతి సీత రాకను గమనించి పరవ ళ్ళుత్తొక్కి వినయపూర్వకంగా తన వంతు సేవను చేసింది. అలాంటి సాధ్విని నీవు చేపట్టడం తగునా! అని జటాయువు రావణాసురునికి హితవు చెప్పాడు. అంతేకాకుండా సీతను గురించి ఇంకా యిలా చెబుతున్నాడు.

సీత సమస్తలోక పతిశీలలకుం దలమానికంబు, వి
జ్ఞాతము సృష్టి కొంచెముగ సాగినయప్పటినుండి నాకు, నీ
సీతను వంటి స్త్రీ విమలసృష్టి యెఱుంగను, నేను చెప్పెదన్
సీతఁ బరిత్యజింపు మిది చెట్టనుమీ పని దానవేశ్వరా!(119)

'సీత అన్నిలోకాలలోని పతివ్రతలపైకి తలమానికం వంటిది. సృష్టి కొద్దికొద్దిగా ఆరంభమైనప్పటినుంచి నాకు తెలుసు, ఇంత నిర్మలమైన సీతవంటి స్త్రీ సృష్టి నాకు తెలియదు. అందుకని నేను చెబుతున్నానురా! నీవు ఈపని చేయడం చెడ్డది సుమా! కనుక సీతను విడిచిపెట్టు' అని చెప్పాడు జటాయువు. సీత గొప్పది. ఆ గొప్ప ఈ లోకంలో మాత్రమేకాదు. సమస్తలోకాల స్త్రీలతో పోల్చుకున్నప్పటికీ ఆమె గొప్పది అనటం వల్ల సీతయొక్క మహౌన్నత్యాన్ని చాటినట్లయింది. ఇంకా అనేక విషయాలు చెప్పి ...

> అకటా! యింతగఁ జెప్పనేమిటికి నీవా! పార్వతీనాథభ
> క్తి కళానమ్రమనస్కుఁడౌదువును, ముక్తిప్రౌఢవాదోగ్రదూ
> షకులం జేరవు, పుణ్యపాపముల విశ్వాసంబు లేనట్టివా
> నికి నిం జెప్పినయట్లు దీప్తమతికిన్ నీకున్ బరిజ్ఞాతకున్.
>
> (133)

'అయ్యో! పాపపుణ్యాలంటే విశ్వాసం లేని నాస్తికులకు చెప్పినట్లు విజ్ఞాని అయిన నీకు, అందుకోసూ నీవు శివునికి వినమ్రభావంతో కూడిన భక్తుడవు. అలాంటి నీకు ఇంతగా చెప్పాలా!' అని జటాయువన్నాడు.

ఇక్కడ మనమొకటి గుర్తుంచుకోవాలి. నాస్తికునకు ఎంత చెప్పినప్పటికీ వాడు తన మాట తనదేకాని ఇతరుల మాట నమ్మడు. అలాంటివానికి విశ్వాసం కలుగజేయలేము — ఎంత ప్రయత్నించినా. కాని ఇక్కడ రావణుడు అలాంటివాడు కాదుగదా! పరిపూర్ణమైనటువంటి శివభక్తుడు. "పార్వతీనాథభక్తి కళానమ్రమనస్కుడౌదువును .....పుణ్యపాపముల విశ్వాసంబు లేనట్టివానికినిం జెప్పిన యట్లు" అని అనటం వల్ల రావణాసురుని ఆస్తిక బుద్ధిని మెచ్చుకున్నట్లయింది. మెచ్చుకుంటూనే బుద్ధి చెప్పడమన్నది ఒక పద్ధతి. అదిగో ఇలాంటి పద్ధతినే విశ్వనాథవారు జటాయువు ద్వారా సంభాషింప చేశారు.

జటాయువెంత చెప్పినప్పటికీ—పరిచిత వస్తువు పట్లపండితుడు నిరాదరణ భావంతో చూసినట్లుగా రావణుడు జటాయువును తొలగించుకుంటూనే తన రథాన్ని ముందుకు నడిపిస్తున్నాడు (134). అది గమనించి జటాయువు 'పరమార్థమున కేఋద్ధాని లౌకికమే చెప్తాను చూడు. బలమైన శత్రుత్వం పెట్టుకునే ముందు

అవతలి విరోధి స్వరూపభావాలు, వాని శౌర్య పరాక్రమాలు మదింపువేసి ఆచితూచి గాని శత్రుత్వం పెట్టుకోవచ్చునా లేదా అన్నది నిశ్చయించుకోరాదు. అది రాజనీతి' అన్నాడు (135).

వేనినో గూర్చి యెక్కువగ వింటిమ విన్న విశేషమంతయున్
వానినిఁ జూడ నిక్కమగు పాటిగఁ దోఁపదు వాని మూర్తియున్
గాని, రఘూత్తముం డతులగాఁ డసురేశ్వర! విన్నదంతయున్
వాని మహానుభావ విభవంబున లేశముగాఁగఁ దోఁచెడున్.
(136)

"ఒక వస్తువు గురించిగాని ఒక వ్యక్తి గురించిగాని అంతకుముందే మనం విని ఉంటాము. తీరా మనం ఆ వ్యక్తిని లేదా వస్తువును చూసిన తర్వాత విన్న సంగతులూ, వాని ఆకారమూ నిజమనిపించదు. కాని రఘురాముని విషయంలో అలాకాదు, మనం విన్న అన్ని విశేషాలు కూడా ఆ మహానుభావుని రూపవైభవం ముందు ఆయన గురించి మనం విన్నదంతా చాలా తక్కువే అనిపిస్తుంది.

మంచి నడి వేసవికాలంలో (రాపటెండకాలంలో) వెదకి వెదకి అగ్గిని తెచ్చుకొని తాటాకులపాక చూరులో ఎవరైనా పెట్టుకుంటారా! అది అంటుకోన కుండా పోతుందా! అర్పానికి సాధ్యమవుతుందా! నీ వంశమే నాశనమౌతుంది చూడు (143)" అని నచ్చచెప్పాడు జటాయువు. మండుటెండాకాలాన్ని అన్న పదులు మరి కొత్తపెళ్ళికొడుకుతో పోలుస్తారు కదా! అంటే అంత రౌలి అన్న మాట. అందులోనూ పాకచూరులలో అగ్గిని పెట్టుకోవటమనేది ఎంత అవివేకం. పుల్లకుపుల్ల రాసుకొని అగ్గిపుట్టి ప్రమాదాలు సంభవించే కాలం—ఎండాకాలమంటే. కాబట్టి ఆపదను నీపై నీవు కొని తెచ్చుకోకు అని జటాయువు సలహా.

## 2.2 జటాయువు-రావణాసురుల యుద్ధము :

వ. అనిన రావణుండు సభ్రూభంగస్త్కారము రథంబు తొలగించబోగా నరదంబు ముక్కుతో వెనుకకు గదిమి (144).

జటాయువు ఇచ్చిన సలహాను రావణుడు కనుబొమలతోనే తిరస్కరించి రథం తొలగించబోవటాన్ని చూసి జటాయువు రథాన్ని ముక్కుతో వెనుకకు

లాక్కువెళ్ళి ముందుకు పోనివ్వకుండా చేశాడు పై వచనంలో 'రథంబు ముక్కుతో వెనుకకు గదిమి' అనకుండా 'అరదంబు' అని వదులుగా అనటం ద్వారా రావణుని రథం ఆ అక్షరాల్లాగే జటాయువు చేతుల్లో చెల్లాచెదురవుతుందన్న సూచన ఉంది.

జటాయువు అంటున్నాడు "చాలు చాలు! నిన్ను ఇప్పటికే చాలా దూరం పోనిచ్చాను. నిలు నిలు! ఇక ముందుకు పోజాలవు! నేను మర్యాదగా మాట్లాడుయుంటే నీకు మర్యాద తెలియదు. ఆ గౌరవం - మర్యాద నీకేం తెలుస్తుంది! నిన్ను ముందుకు పోనివ్వను. అప్పుడుగాని నీకు మర్యాద తెలిసి రాదు (145). ఎంత చేతకానివాడెవడైనాగాని ఆత్మబంధువుల ఆపదను కళ్ళారా చూసికూడా కాళ్ళుచేతులాడేంత వరకూ ఊరకే ఉండదు (146)" చేతకాని అల్పులే ఊరకే ఉండలేరు కదా! తాను మరి పరాక్రమవంతుడై కూడా ఎలా ఊరకుండగలనని తన్ను గురించి జటాయువు ఈ విధంగా చెప్తున్నాడు.

**నన్నెన్నన్ మఱి చేతఁగాని తనమన్నన్, వేలువుల్ రక్కసుల్**
**మిన్నున్ మన్నున నమ్మ, రున్నత గరున్నిర్హ్రాది సంఘుష్ట వా**
**రాన్నిధ్యుగ్ర వియత్ప్రచండుని సమారబ్ధాహవోన్మాదినిన్**
**పిన్నయ్యన్ గరుడిన్ మరుద్గిరిశిఖాభిన్నున్ స్మరింపించెదన్.**
**(147)**

"నన్ను మరి చేతకాని వాఁడిననుకున్నావా! — నన్ను చేతకానివాడంటే దివిపై నుండే దేవతలు నమ్మరు; భువిపై నుండే రాక్షసులూ నమ్మరు. ఉన్నతమైన రెక్కల ప్రతిధ్వనితో ఆకాశంలో తిరిగే ప్రచండుడైనట్టి, యుద్ధోన్మాది అయినట్టి, పర్వతశిఖరాకారుడైనట్టి మా పినతండ్రి గరుడిని తలపింపజేస్తాను (యుద్ధంలో)" అన్నాడు జటాయువు.

గరుడని పరాక్రమం దీర్ఘంగా ఉంది కనుక సుదీర్ఘ సమాసంచేత దాన్ని భాసింపజేశాడు కవి. "ఉన్నత గరున్నిర్హ్రాది సంఘుష్టవారాన్నిధ్యుగ్ర వియత్ప్రచండుని'. 'సమారబ్ధాహవోన్మాదినిన్' అనే ప్రయోగంవల్ల యుద్ధమంటే ఎంత వెర్రి ఉత్సాహం చూపేవాడో తెలుస్తుంది. 'మరుద్గిరిశిఖాభిన్నున్' అనటం వల్ల ఆ గరుడిది ఆకారం ఎంత లావుపాటిదో తెలుస్తున్నది. పైగా పర్వతానికి

గరుత్మంతునికి అభిన్నత్వం (గిరిశిఖ-అభిన్నున్) చెప్పటం వల్ల గరుత్మంతుడూ పర్వతం రెండూ ఆకారంలో ఒకటే అనే విషయం స్పష్టమవుతోంది.

"మీ ముందు తరాలు కూడా పంక్తిరథుల చేతిలో రాక్షసులు ఓడటం జరిగి పోయింది. ఇప్పుడు నీవు రాముని కాలి గోటికి కూడా సరిరావు—అదీ చెప్పాలంటే ఒకవేళ నా కాలి గోట మిగిలితే (148)" అన్నాడు జటాయువు.

చంచు గరుత్త్పమాథన నిషాదుని నిర్దయ నన్నుగాని యూ
హించకు మల్పభావమున, నేనును వింధ్యగిరీంద్రమున్ నిరో
ధించిన కుంభసంభవుని తీరవువాడను నీ శిరస్సు తూ
లించెద! ఱెక్కగాలి విదలించి, లయోగ్రవిచిత్రఝంఝగా.
(149)

"నన్ను తక్కువగా అంచనా వేయకు. వింధ్యపర్వతాన్ని అణచిన కుంభసంభవుడైన అగస్త్యుని వంటివాడను నేను. నేను విదలించిన రెక్కల యొక్క ప్రళయకాలపు సుడుగాలులతో నీ శిరస్సు తూచేస్తాను జాగ్రత్త" అన్నాడు జటాయువు.

నీ కంటెన్ మునుపైన రక్కసులఁ గంటిన్ వందలన్ వేల నా
హా! కల్పాది మహోగ్ర రాక్షస సమూహం బింతకంటెన్ మహా
గ్రాకారుల్ భయదక్రియా జటిలులున్, కాలం దలల్ దన్నితిన్!
గైకో కీవాక ఱెక్క పోకుము! శిరోఘాతంబు గావించెదన్.
(150)

"నీ కంటే మునుపు వందల వేల రాక్షసులను చూశాను. యుగారంభం నుంచి ఇంతకంటే మహోగ్రమూ, మహోగ్రాకారులూ, క్లిష్టమూ-భయంకరమూ అయిన రాక్షసుల నెందరినో నా కాళ్ళతో తలలు తన్నినాను. ఇదీ తెలియక నీవు గర్వం పడవద్దు. శిరస్సు ఖండిస్తా నేమనుకున్నావో!"

చావ చెడినసైన జవర కాకుండదు
ముసలి వీఁడటంచు మోద పడకు

ఒక్క తన్నుతోడ నుప్పరంబెగసెదు
పడినచోటు తెలియఁబడదు మఱల. (151)

"ముసలివాడని సంతోషపడేవు ఒక్క తన్ను తన్నినానంటే పైకెగసి కింద పడినచోటు కూడా తెలియకుండా తంతాను."

అరె! యిందాఁకటి నుండి చెప్పెదను నీ కావంత విన్పించదే!
ధరణీ సర్వవిశాలదేశము ననంతంబైన కాలంబు, శౌ
ర్యరమారూఢు డగున్ సనాతనుఁ డగున్‌రా! విద్ధ మా మా పర
స్పర మైత్రీమహిమం బెఱుంగు నఖిలంసన్ దండ్రికిన్
(152)

"అరె! యిందాఁకటినుంచి చెప్తున్నాను నీకు కాసింతయినా వినిపించదే! శ్రీరామచంద్రు డెవరనుకున్నావు—విశాల ప్రపంచమంతా వ్యాపించుకున్నవాడు. అనంతుడు, శౌర్యసంపన్నుడు, సనాతనుడురా శ్రీరాముడంటే! ఆ రాముని తండ్రి దశరథునికీ నాకూ గల పరస్పర స్నేహం యొక్క గొప్పతనం ఇప్పటికైనా తెలుసుకో.

ఇక ఇది నీతో తేలిపోవటమో లేదా సకలదానవ వంశం అడవిలో రేగిన దావాగ్నిలాగా మీ వంశం కాలిపోవటమో జరుగుతుంది (153)." ఇక నిన్ను అడుగు కదలనివ్వనన్నాడు జటాయువు. ఏమి చేస్తావు? అని రాక్షసుడు తిరస్కారంగా అన్నాడు. ఏమి జరుగుతుందో చూస్తావుగా అని జటాయువు అసురుని చేతిలో చెర్నాకోలను ఎగ్గొట్టి తన వాడి అయిన రెండు కాళ్ళ గోళ్ళతో రాక్షసుని వీపుపై గాయంచేసి గాడిపడేటట్టు చేశాడు (154). అప్పుడు మళ్ళీ ఖగరాజు ముక్కుతో రథాన్ని వెనక్కి అదిమిపట్టుకుంటే రథం కదలలేకపోయి వెనక్కి వాలిపోయింది. తీక్ష్ణమైన కాలిగోళ్ళతో కింది నుంచి రథాన్ని తాచికొట్టడమూ, తన ఎడమరెక్కతో ఫెళామని రావణాసురుని కుడిభాగాన్ని కొట్టడమూ ఒక్కసారే జరిగిపోయింది. తత్ఫలితంగా కుడిచెవి-కుండలం నేలమీద పడి భగ భగ మండింది (155). 'నేలపడి భగభగ మండి' అని కవి అనటంవల్ల కర్ణ కుండలం భగభగమండినట్లే రావణాసురునికి కోపం వచ్చింది. అది చెప్పటానికి ఈ కోపాన్ని కర్ణకుండలం మీద ఆరోపించి చెప్పడం కవి చమత్కారం.

కుండలం ఎర్రటి మణులతో పొదిగించి ఉండటంవల్ల ఎర్రటి కాంతితో మెరవటం సహజమే కదా! దాన్ని వక్రీకరించి చెప్పటం కవుల చాతుర్యం.

ఏరా పక్షి! అదేమొ వాగికొని నీవే పోటు వన్నన్ గరు
ద్ధారాపాతము తాచినానని కశాదండంబు చే నిచ్చి క్రు
ద్ధారన్ సారథికిన్, రథంబున ధనుర్దండంబు చేఁబూని చ
క్షూ రాజీవములందు నిర్వది మహోగ్నుల్ జ్వాలలై మండగన్.
(156)

అరలిప్తలోన రావణు
నరదంబు వియత్పథంబునం బెగిరె, ధను
శ్శరములు పరగించెడు ద
వ్వరసి, దశాననుఁడు ముల్కు లాజిఁట గొట్టెన్.
(157)

'ఏరా పక్షీ! అదేమో వాగినంత సేపు వాగుకొని నీవే పోటావనుకుంటే రెక్కలతో గొప్పగా తాచికొట్టినావని తెగనీల్గుతున్నావు' అని రావణాసురుడు తన సారథికి చెర్నాకోలనిచ్చాడు. మంటలు మండిపోయినట్లు ఇరవై కళ్ళు ఎర్రబడి పోగా రథంలో నుంచి విల్లునందుకున్నాడు రావణుడు. (156). అరలిప్తకాలం (0.2 సెకనులు) లోనే రావణుని రథం ఆకాశంలో ఎగిరింది. ధనుర్బాణాలు ప్రయోగించేటంత దూరంపోయి దశకంఠుడు ఆరు బాణాలతో జటాయువును కొట్టాడు (157).

ఇక్కడ 'ఏరా పక్షి'! అనే సంబోధన చాలా సహజంగా ఉంది. ఒరే అక్కుపక్షీ! అని ఎగతాళిగా పిలిచే సంబోధన కూడా లోకవ్యవహారంలో ఉంది కదా! 'ఇరవై కళ్ళు జ్వాలలై మండినా'యని చెప్పటంవల్ల వీపుమీద గాడిచేసిన గాయానికి రావణునికెంత కోపం వచ్చిందో తెలుస్తుంది. అంతేకాకుండా జటాయువు యొక్క మొదటి దెబ్బ ఎంత ఘాటుగా ఉందో రుచి చూశాడు రావణుడు. అంత మాత్రమేకాదు ఇంతకు ముందు తన పరాక్రమాన్ని గురించి చెప్పుకున్న జటాయువు మాటలకు—చేతలకు సత్యం తెలిసివచ్చింది రావణునికి. గరుడుడి

పరాక్రమాన్ని తలపిస్తానురా అన్నాడుగదా మరి. అప్పటి మాటలు, ఇప్పటి చేతలు—రెండూ సరిపోతున్నాయి — వేరేజా వేసుకున్నాడన్నమాట రావణుడు. అందుకే ధనుస్సు చేతబట్టుకొని జటాయువుపైకి ఒకేసారి అగు బాణాలు ప్రయోగించవలసి వచ్చింది - రావణునికి.

ముక్కుతో చిమ్మి తుది రెక్కలతో అంబుల (బాణాలు) నన్నిటిని విదలించేశాడు జటాయువు. రావణాసురుని పైకి శీఘ్రంగా ఒక్కుదుటున దూకి వాని రొమ్ము, భుజాలను—మొక్కను చీల్చిపారేసినట్లుగా చీల్చిపారేయగా రక్తం బొళ్ళుబొళ్ళున పొడుచుకొనివచ్చింది (158).

గ్రద్దవోలిక దానవు రథము కాకి
వోలె ఖగరాజు, నరదము పొడువ నితడు
నతని కిం దవ్వుబోవఁగా నరదమిట్లు
నంబుధరవీధి జంక్రమణంబు సాగె. (159)

గ్రద్ద మాదిరి రాక్షసేశ్వరుని రథం ఉంది; కాకివలే జటాయువు పొడుస్తూ ఉన్నాడు; మళ్ళీ ఖగరాజుకు దూరంగా రథం పోవటం ఇలాగా మేఘాల వీధిలో సుళ్ళుసుళ్ళుగా (వలయాలుగా) రథం తిరుగుతున్నది (159).

పది, ఇరవై, ముప్పై బాణాలు వరుసగా రాక్షసుడు పిడికిళ్ళతో విజృంభించి విసరుతున్నాడు వాటన్నిటిని ముక్కుతోనే ఛేదించి మహాకారం గల్గిన విహంగరాజు (పక్షిరాజు) ఎగిరి చూకుతున్నాడు. సారథికి రథం తోలడం క్లిష్టమయిపోయింది. రథం పల్టీలు కొట్టింది. అసురుడు బాణసమూహాన్ని వేసి కడుపు నుంచి శిరస్సు వరకు రెక్కల మూలప్రదేశాలను చీల్చి నొప్పించాడు. ఈ ప్రకారం జటాయువు, రావణాసురులు యుద్ధం చేస్తుంటే ఆకాశంలో భాస్వరం మండినట్లుగా మిక్కిలి వేగంతో ప్రకాశవంతమైనకాంతివలయాలుచెలరేగాయి(160).

ఒక ఝుంఝూపరివేగ వీచిహతిచే నుత్పాటితంబైన కిం
శుక వృక్షద్వయ ముగ్రవర్ణ కుసుమ స్తోమారుణాలాత చ
క్రక సంభ్రాంతిగ మింట జంట తిరుగంగానైన యుక్తైవిహం
గక రక్షోరథముల్ చలించెఁ గ్రూత సంఘట్టంబు విశ్లిష్టమున్.(161)

ఒక ప్రళయ కాలపు సుడిగాలియొక్క తీవ్రవేగానికి దట్టమైన ఎరుపురంగు కలిగిన పూలతో నిండిన రెండు మోదుగచెట్లు పెకలింపబడి మండుతున్న అగ్ని చక్రాలుగా తిరుగుతున్న భ్రాంతిని గొలిపింది — ఖగరాజు, రాక్షసరాజు చేసే విశ్లిష్టమైన యుద్ధ సంఘటనలకు.

దట్టమైన పూలు పూసిన ఎరుపు కాంతి గలిగిన మోదుగచెట్లు (కింశుకవృక్ష ద్వయం)తో ఖగరాజు రాక్షస రథాలను పోల్చటం అత్యుత్తమంగా ఉంది. కింశుక వృక్షం (చిలుక ముక్కువంటి పూలు పూసిన చెట్టు) అనటం వల్ల చిక్కటి ఎరుపు కాంతిపూలు వాళ్ళిద్దరి దేహాలనుంచి కారుతున్న చిక్కని రక్తానికి గుర్తు చక్కని భావపటిమ గల పద్యమిది.

రక్షోరాజ ధనుర్విముక్త పటు నారాచంబు లంభోధరా
ధ్యక్షుల్ క్రమ్మినయట్లు క్రమ్మ ఖగలోకాధీశ్వరున్, మేఘసం
ఘ క్షోదంబుగ హేళి తోఁచుగతి నక్షయ్యాకృతిన్ ఐక్షిరా
జక్షీణోగ్రబలుండు తద్రథముపై నంతంత లంఘించెడున్.
(162)

రాక్షస రాజయిన రావణుని ధనుస్సునుంచి విడిచిన బాణాలు జలపూరితమైనట్టి మేఘరాజాలు (బలమైన మేఘాలు) క్రమ్ముకున్నట్లు ఖగరాజును ఆవరించివేశాయి. నాశనం చెయ్యడానికి శక్యంకాని ఆకారంగలవాడైనట్టి, క్షీణింపని ఉగ్రమైన బలం కలవాడైనట్టి జటాయువు - మేఘ సమూహంలాగా ఆవరించిన బాణ సమూహాన్ని పొడి పొడిచేసి మరింత ఉత్సాహంతో రావణుని రథంపైకి దూకుతున్నాడు. 'అంతంత లంఘించెడున్'— అంతంత అని అనటంవల్ల ఒక్కసారి పైనుంచి దూకి ఆ వేగంతో రావణుని పటిమనికొట్టి మళ్ళీపైకి పోయి వేగంగా దూకి చాచి కొడుతున్నాడనే భావం వస్తోంది.

జటాయువు రావణాసురులు శక్తివంచన లేకుండా కృషిచేసి యుద్ధం చేస్తూండటంతో వాళ్ళకి కల్గిన గాయాలవల్ల ఇద్దరి కంఠ ప్రదేశాల నుంచి, ఇరువురి పొడుగైన భుజాల్లోనుంచి ఇద్దరి నడినెత్తుల (తలపై నడిమిభాగం) నుంచి రక్త బిందువులు ఇందుసగింజల్లాంటి స్వేదబిందువులతో కలిసి ప్రవాళ (ఎర్రటి ముత్యాలు) సరాల లాగా కిందికి జారి భూమి మీదికి పడుతున్నాయి (163).

ఆకాశంలో పయనించే రథంలో నింపాదిగా కూర్చోవటం సీతకు కష్టమయి పోయింది. ఎందుకంటే జటాయువు జరిపే దాడివల్ల మిక్కిలి వేగంగా పోతున్న రథం ఒక్కసారి వాలి ప్రకంపించింది. దైత్యునికి రథం నడిపించటం చాలా క్లిష్టమయిపోయింది (164).

అసురుని యేయు నమ్ములకు సంతును బంతును లేక మాటికిన్
ముసరుచునుండఁ గోపమును బొంది విహంగము లోకనాయకుం
డసిత పయోద ముగ్రపవనాహతిఁ దూలినయట్లు బండిపై
విసరున వచ్చి గూఁడచటుఁ బెట్టినవోలిక వ్రాలి నిల్చుచున్. (165)

అసురుడు వేస్తున్న బాణాలు మాటిమాటికి పక్షిరాజుపై ముసురుకొంటున్నాయి (ఇతనికి ఇరపై చేతులాడు. పైగా బాణసమూహాన్ని వేగంగా వెంటవెంటనే ప్రయోగించాడు). దానితో విహంగరాజైన జటాయువుకు తీవ్రమైన కోపం వచ్చి బెస్సుమని విసురుగా వచ్చి రథంపై వాలి నిలిచేటప్పటికి భయంకరమైన గాలి దెబ్బకు (గాలివాటానికి) నీలివర్ణ మేఘం ముందుకు తూలిపోయినట్లుగా ఆ రథం ముందుకు కొట్టుకుపోయింది.

'ముసరమనుండ' అని ఉండటం వల్ల ఏదైనా ఒక తీపి పదార్థంపై ఈగలు ముసురుతున్నప్పుడు ఆ పదార్థమేమిటో కనిపించకుండా ఈగలు గుంపు మాత్రం కనిపిస్తూ ఉండటం మనందరికి అనుభవంలో ఉన్న దృశ్యమే. అట్లే ఇక్కడ జటాయువుపై రావణాసురుడు కురిపించిన బాణాల గుంపు జటాయువును చుట్టుముట్టేసింది. అంతెందుకు తేనెతుట్టెను తీసుకుందాం. తుట్టెపైనుండే తేనెటీగల గుంపు కనిపిస్తుందే తప్ప తుట్టె ఏమాత్రమూ కనిపించదు. అదిగో ఆ విధంగా జటాయువు బాణసమూహంచేత కప్పబడ్డాడు. కవి తెలియని విషయాన్ని తెలిసిన విషయంతో పోలికపెట్టి చెప్పగలిగిన క్రియను (ముసరుచు నుండ) ఇక్కడ వాడటం వల్ల పాఠకులు తమ అనుభవానికి దూరంగా ఉండే సంఘటనలను తెలిసిన విషయంద్వారా అనుభవంలోకి తెచ్చుకొని భావతాదాత్మ్యం పొందడానికి అవకాశం ఏర్పడుతుంది. అందుకే కవి ప్రతిభ పలానా పదం పలానాచోట కూర్చిన కూర్పులోనే ఉంటుంది. అంటే జటాయువు శరీరంపై బాణాలు సందు (gap) లేకుండా పడ్డాయన్న మాట.

దట్టమైన నీలివర్ణ మేఘాలు ఆవరించినట్లు రాక్షసుని చర్య (వేసిన బాణాలు) ఉన్నప్పటికీ—ఉగ్రమైన గాలి దెబ్బకు, అంటే అత్యంత శక్తివంతంగా వీచిన గాలికి అంతటి దట్టమైన నీలిమేఘాలు చెల్లాచెదురై పోయేటట్లుగా, జటాయువు యొక్క రెక్కలచేత వీచిన గాలికి అంతటి బాణసమూహాన్ని కూడా ఛేదించ గలిగాడు. ఒక్కసారి రెక్కలు ఉగ్రంగా విదలించేటప్పటికీ బాణాలన్నీ అయిపు లేకుండా పోయినాయి.

దనుజుని వింటికట్టపయిఁ దా నిరు కాళ్ళులమర్చి పట్టి ఫె
ళ్ళున విఱిచెన్ సురారిమెడలో మణిమౌక్తికహారమున్ పుటు
క్కునఁ దెను వేఁడివాఁడి ముకుఁగొన విదల్చుచు ఁద్రుంచె ఱెక్కఁ దా
చిన వగు తాపులన్ రథము చిందరవందర చేసెఁ దీవ్రతన్.
(166)

పై పద్యంలో అసురుని ప్రతాపంచెప్పి, ఇక్కడ పక్షి ప్రతాపం చెబు తున్నాడు కవి. రథముపై వ్రాలి రాక్షసుని ధనస్సుపై రెండు కాళ్ళు పెట్టి పట్టుకొని దాన్ని ఫెళ్ళుమని విరిచాడు. గట్టిదైనట్టి, వాడి అయినట్టి ముక్కుకొనతో అసురుని మెడలో ఉండే ముత్యాలహారాన్ని పుటుక్కున తెంచాడు ఖగపతి. రెక్కలతో తాచిగొట్టిన తాపులతో (రాపిడితో) రాక్షసుని రథం చింపరవందర చేసేశాడు.

ఇక్కడ ఒక పక్షి చేసే చర్యను సహజంగా చెప్పాడు కవి. ముక్కు కొనతో విదలించి, తుంచి రెక్కలతో వరీమని కొట్టడం, రెండు కాళ్ళు ధనుస్సుపై పెట్టి విరచటం మొదలైన సంఘటనలు చాలా సహజంగా వర్ణించ బడ్డాయి.

విహంగరాజు లేచి వెళ్ళిపోయేటప్పటికి బందిపోటులు పడి పాడైన ఊరు లాగా రథం చిందరవందరై కనిపించింది. ఈ దుఃఖసంఘటనకు దానవుడు కోపంతో ఇంకొక విల్లు తీసుకున్నాడు (167).

విహగేంద్రున్ బహుబాణపాతములుగా వేధించె ఱక్కాఁడకుం
డ, హతాల్లగ్నశరోగ్ర నైశముఖకోణం బొప్ప ముక్కాఁడకుం

ద, హ్యాశాకాశ చరేశ్వరప్రభఘుగా నారాచధారా సుదు
స్సహ కారావినిబద్ధుడై విహగపంచాస్యుండు తూఁగాడుచున్.
(168)

రావణాసురుడు ఖగరాజైన జటాయువును బహుబాణాలతో ఊపిరాడకుండా, రెక్కాడకుండా కొట్టి వేధించాడు. అందులోనూ ఆ బాణాలు వెంటవెంటనే వింటినారి నుంచి బాగాలాగి విడువబడుతున్నాయి. ఆ బాణాల కారాగారంలో బంధింపబడ్డ విహగేంద్రుడు (జటాయువు) వాటి దెబ్బకు సోలిపోయి తూగాడినాడు. రెక్కాడకుండ, ముక్కాడకుండ అనే తెలుగు నుడికారాలతో ఉన్న ఈ క్రియలు ఒకటి రెండు పాదాల చివర వరుసగా ఉండటం పాఠకులు గమనించాలి. వాటికి తోడు 'సుదుస్సహ, తూగాడుచున్' అనే పదాలు రెండు నాలుగు పదాల చివర ఉండటం చూడవచ్చు. పై రెండింటి ఫలితం కింద రెండింటిలో కనిపించింది.

అతి బలసాహసు డగు జటాయువు బాణసమూహపంజరో
ద్గతుఁడయి శిష్టలగ్నములఁ గాలను దన్ని శరంబు లిన్ని, దూ
రత ఉపరిస్థితిన్ వదనరక్తము ముక్కును బొట్టక్రింద రా
చి తుడిచి, దవ్వుగాఁ జనెడు చెట్టసురం గని కోపమేఁచుడున్
(169)

బాణ సమూహ పంజరంలో బంధింపబడ్డ అతిసాహస బలవంతుడైన జటాయువు మంచి నేర్పుతో ఆ బాణాల నన్నిటిని తన కాళ్ళతో తన్ని విదలించి వేశాడు. ముఖంమీది నుంచి కారుతున్న రక్తాన్ని ముక్కుతో పొట్టకు రాకి (రాచి) తుడుచుకొన్నాడు. ఇంతలోగానే రావణాసురుడు కొంతదూరం వెళ్ళాడు. దూరంలో పోతున్న చెడ్డ రాక్షసుడిని చూసి జటాయువుకు కోపం వచ్చింది.

ఈ పద్యంలో పక్షి చేసే క్రియావిశేషాన్ని బాగా విశ్లేషణ చేశారు విశ్వనాథ గారు. ముక్కును పొట్ట కింద రాచి తుడుచుకోవటం - ప్రకృతిలో పక్షి చేసే సహజమైన చర్యలు మనకు జ్ఞప్తికి వస్తాయి, అంత బాణపంజరాన్ని కూడా జటాయువు తన కాళ్ళతో తన్ని పెకలించివేశాడంటే జటాయువు ఎంత బలవంతుడో అడుగడుగునా తెలుస్తున్నది.

తీవ్రపక్షఝంఝానిల సమాహతి మును తూఁగి
వెన్నుల వెదుళ్ళగొమ్ములు విప్పఁగాఁగ
నాకసం బావరించిన యట్లు గరుడు
దారసంభార ఘోరవిస్తారమూర్తి. (170)

మఱల దానవేంద్రు నరదంబుపై దూకె
మఱల ధనువు విఱిచె మఱల ముక్కు
తోఁక నసురఁబొమ్మ గాఁడించె, గరుదుగ్ర
ఘాత పాతములను గలఁచె మఱల. (171)

తీవ్రమైన గాలివేగానికి వెదురు కొమ్ములు ఒకదానికొకటి కొట్టుకొని వెదుళ్ళ వెన్నులు విచ్చుకొని ఆకాశంలో ఆవరింపకున్నట్లుగా జటాయువుయొక్క బ్రహ్మాండమైన రెక్కలు విశాలంగా విప్పుకున్నాయి (170). అలా ఉగ్రమూర్తి అయిన జటాయువు మళ్ళీ దానవేంద్రుని రథంపైకి దూకి ధనుస్సును తన రెండు కాళ్ళతో విరిచిపారేశాడు. రాక్షసుని బొమ్మ గాడిపడేటట్లు గాయపరిచాడు. తన రెక్కలతో అసురుణ్ణి ఎడాపెడా వాయించేస్తూ ఆ దెబ్బలతో అసురుడిని కలచివేస్తున్నాడు (తీవ్రంగా బాధపెట్టేస్తున్నాడు) జటాయువు.

మఱల, మఱల అని 171వ పద్యంలో పలుసార్లు ఆవృత్తి కావడంవల్ల - ఇంతకు ముందు ధ్వంసం అయ్యేట్టు చేసిన పనినే మళ్ళీ చేసి విధ్వంసం చేస్తున్నాడని తెలియటం మాత్రమే కాకుండా పక్షిరాజు చేస్తున్న తీవ్రమైన విజృంభణను పదే పదే జ్ఞప్తికి తెస్తున్నాడు కవి మనకు. పక్షిరాజు మళ్ళీ మళ్ళీ విజృంభిస్తున్నాడు.

పిచ్చుకయా! పెడరెక్కలు
వెచ్చని మెడ విఱువ, దవ్వ వెలయక ధనువున్
బుచ్చికొనుటెట్లు? శరములు
వుచ్చుట యెట్లసుర పాలుపోవక యుండెన్. (172)

“ఒక పిచ్చుకా ఇంతపని చేస్తున్నది! పిచ్చుకేమిటి ?... ఇంత సాహస కృత్యం చేయటమేమిటి ? ధనుస్సు నందుకొని పోరాడాలంటే దూరం పోకపోతే ఎట్లా సాధ్యమవుతుంది? బాణాల నందుకునేది ఎట్లా” అని అసురునికి దిక్కు-

తోచలేదు రావణాసురుడు పక్షిరాజు చేసిన పనికి ఇంతగా ఆశ్చర్యం పడ్డాడు. ధనుస్సును అందుకోడానికే సమయం చాలలేదతనికి.

**ఖగపతి లేచిపో నసుర, కార్ముక మింకొకఁ డూని పీని మె**
**త్తగఁ బొడుతున్, మఱిన్ మఱియుఁ దా బయికిం జనుదెంచునంచుని**
**మ్నగ గిరికొమ్మునన్ దుముకు మాదిరి, ఘోరశిలీముఖోగ్రపా**
**త గురు గరుచ్ఛరీర వినిదారణముం బొనరించె నుగ్రుడై. (173)**

కొండ మీది నుంచి దుమికే సెలయేరులాగా ఈ జటాయువు పైపైకి వస్తున్నాడని ఉగ్రుడై రావణాసురుడు ఖగపతి పైకి లేచినప్పుడు ధనుస్సు నింకొకదానిని తీసుకొని తీవ్రమైన పదును గల అగ్రభాగం కల్గిన భయంకరమైన బాణాలతో భారీ శరీరంగల జటాయువును తీవ్రంగా హింసించాడు.

ఆ దానవేశ్వరుని సారవంతమైన బాణాల దెబ్బలకు దేహమంతా నిస్సారమై పోయినట్లయి ఉన్నవాడున్నట్లుగా లేవలేకపోయాడు జటాయువు. అయినప్పటికీ రథంలో కంటతడి పెడుతున్న సీతను చూసి కోపోద్రిక్తుడై ఖగరాజు తన శరీరం లోని శక్తినంతటిని కూడగట్టుకొని — పూర్వం కూర్మం (కూర్మావతారంలో) చేత సముద్రంలోనుంచి వడుపు లేసిన మందరపర్వతంలాగా దనుజేశ్వరుని రథంపైకి దూకినాడు. దూకీమూకడంతోనే సారధి నెత్తిపైన ముక్కుతో బలంగా అదిమేటప్పటికి వాని కపాల రంధ్రంనుంచి మూలాధారం (గుదస్థానం) దాకా ముక్కు దిగబడి కొరత వేసినట్లయిపోయాడు. మృత్యువు కోరలలాగా ఉరివే వాడి అయిన ముక్కు కొనలు-ప్రళయకాలపు అగ్ని - ఎండిన వృక్షాల జంటను కాల్చివేసినట్లుగా సారధి శరీరాన్ని రెండు భాగాలుగా చీల్చివేశాడు జటాయువు (నెత్తినుంచి గుదస్థానం దాకా ముక్కు దింపేశాడన్నాడు కనుక సారథి శవం రెండుగా చీలిపోయింది). రథ చక్రాలు, ఇరుసులు, రథం నొగలు, తడక, కాడి, మోకు మొదలైన వాటినన్నిటినీ ముక్కలు చేసేశాడు జటాయువు. అంతటితో రావణుడు భూమిమీదికి గబుక్కున దూకి, జానకీదేవిని చంకలో పెట్టుకొని ఆకాశమార్గంలో వెళుతున్నాడు. జటాయువు కొద్దిసేపు అలసట తీర్చుకొని ఆకాశమార్గంలో పోతున్న రావణుని అనుసరిస్తూ ఈ విధంగా అంటున్నాడు (174).

### 2.2.1 జటాయువు రావణాసురునికి రెండవసారి హితబోధ చేయటం:

యుద్ధం ఇంతవరకూ చేసిన జటాయువు మాత్రమే కాదు అలసిపోయింది, పాఠకులు కూడా. అందుకే కాసేపు ఉపశమనం చెందడానికి (రిలీఫ్ పొందటానికి) యుద్ధవర్ణన విరమించి కవి రాక్షసునికి మళ్ళీ హితబోధ చేయిస్తున్నాడు జటాయువు చేత.

"ఇంతవరకు చెప్పవచ్చు, ఇంతవరకు చాలు అని ఎక్కడ నియమం పెట్టుకోగలం! మహామోహం, కల్మషపూరితమైన చిత్తంగలవాళ్ళకు కడపటిదాకా చెప్పవలసి వస్తుంది (175).

ఈ భూమి మీద అన్నమిక లేదునీకు. ప్రాణావసాన దశలో ఉన్నావిప్పుడు నీవు. కూత పెట్టి పిలిచినా కూడా నీకు తోడెవ్వడూ రాడు. నీ దుర్బలమైన అగ్ని బాణాలు నన్నేమీ చేసుకోలేవు. కాబట్టి రామచంద్రుని గుణానుకూలమైన మర్యాదతో నీ మత్తును వదలి పెట్టు (176)" అన్నాడు జటాయువు.

**ఒక్కఁడు దుష్టకార్యముల నూరక చేయుచునుండి యెప్పుడో**
**యొక్కఁడు మంచిదౌ పని నెదో పొనరించిన లోకమెల్ల నా**
**ముక్కఁడి చేఁతఁ బూర్వకృతమున్ గణియింపక మెచ్చుఁ జుమ్మ! నీ**
**విక్కృతిచేయు సత్కృతులకెల్లను సత్కృతి యిద్ది, రావణా!**
**(177)**

"ఎప్పుడూ దుష్టకార్యాలు చేసేవాడొక్కడు ఎప్పుడైనా ఏదైనా ఒక చిన్న మంచిపని చేసినట్లయితే లోకులందరూ ఆ అల్పమైన పనికే వాడు పూర్వం చేసిన ఎన్నో చెడ్డపనులను మరచిపోవడమే గాక పైగా మెచ్చుకుంటారు సుమా! కనుక నీవు ఈ పని చెయ్యి అన్ని సత్కార్యాలపైకి సత్కార్యమిది రావణా!" అని హితం చెప్తున్నాడు జటాయువు. ఎన్ని రకాలు నచ్చజెప్పడానికి వీలుందో అన్ని రకాలా చెప్తున్నాడు జటాయువు.

విశ్వనాథ సత్యనారాయణగారు ఈ ఉత్పలమాల వృత్తాన్ని చక్కటి తెలుగ నుడికారానికి ఉపయోగించుకున్నారు. సాధారణంగా మంచి సంభాషణపై ఖరీస్ ప్రదర్శించాల్సి వచ్చినప్పుడు వారు మధ్యాక్కరలు రాస్తారు. ఇక్కడ మాత్రఁ

ఉత్పలమాలలోనే ఇంత చక్కటి సంభాషణ తెలుగు పదాలతో కూర్చినారు. పరాక్రమాలు వర్ణించేటప్పుడు కాని యుద్ధ ఘట్టాలు వర్ణించేటప్పుడుగాని దీర్ఘ సమాసాలు ప్రయోగించినట్లుగా ఇలాంటిచోట్ల సంస్కృతభూయిష్ఠమైన పదాలు వాడరు. వీలయినన్ని తెలుగు పదాలు వాడటాన్ని మనమిక్కడ గమనించవచ్చు.

జటాయువంటున్నాడు— "నిన్నింతదాకా తెచ్చాను ఇంతదాకా విన్నమాట వృథాకాకుండా నా మాట పాటించు ఇప్పటికైనా! లేకపోతే నాచేత పదినోళ్ళతో మన్నుతింటావు చూడు జాగ్రత్త (178)." జటాయువు తర్వాత అన్నంత పనీ చేశాడు. రావణునితో గంభీరయుద్ధం చేసి మన్ను కరపించాడు.

పశువున కొక్క దెబ్బయును బ్రౌఢిగ మానిసికొక్క మాటయున్
పశువుసకంటె దెబ్బలును వందలు మానిసికంటె మాటలున్
విశదము వేయి తింటివని వింటివి, దైత్యుడు రెంటిపై మహా
తిశయ జడత్వమూల ప్రకృతిస్థిరుఁ డన్న మహార్థ కల్పనన్. (182)

మంచి పశువుకొక్క దెబ్బ, పెద్ద మనిషికి ఒక్క మాట చాలు గ్రహించుకోడానికి. నీవు పశువుకంటే వందల దెబ్బలు తిన్నావు; మనిషికంటే వేయి మాటలు విశదంగా విన్నావు; కాని నీవు ఈ రెండు విషయాలను మించి ప్రకృతిలోని స్థిరమైన (కదలని) జడపదార్థంలాగా ఉన్నావు.

కవి ఇక్కడ మంచి దృష్టాంతం చెప్పాడు. మంచి చురుకైన ఎద్దును ఒక దెబ్బకొడితే అది మళ్ళీ ఆ పైన ఒక్క దెబ్బ కూడా కొట్టించుకోకుండా యజమాని మనస్సునెరిగి పనిచేస్తుంది. నిండైన మనస్సుగల మనిషి ఎవరి దగ్గరైనా ఒక్కమాట అనిపించుకుంటే మళ్ళీ అతను జన్మలో మాటపడకుండా విధి నిర్వహణ చేస్తాడు. కాని ఇక్కడ రావణాసురుని పరిస్థితి తద్భిన్నంగా ఉంది— అని జటాయువుచేత చక్కగా చెప్పించాడు కవి.

"అగ్గిని చీరలో ముడుచుకొని దొంగిలించుకొని పోయినట్లుగా ఉంది నీ వ్యవహారం రావణా! భగ్గున మండిపోతావు సుమా! ఆ తర్వాత ఇది ఆర్పడానికి ఎంత ప్రయత్నించినా సాధ్యం కాదు. ధర్మానికి ద్రోహం చేశావు కనుక ఈ అగ్ని చల్లారదు (183).

పోవకు నీవు నిక్కముగఁ బూరుషుఁ డౌదువయేని నిల్మి, నీ
తో వివదింప, ముక్కుకొనతో నెద చింపను, రమ్ము వెన్కకున్
శ్రీ విభుఁ డింతకున్ దిరిగి చేరఁగవచ్చును బర్ణశాలకున్
నీవు నతండుఁ బోరు డెవనిన్ మఱి వేఁడు జయించువాఁడుగా.

(184)

"నీవు నిజంగా పురుషుడవే అయితే నిలు. నీతో ఇక వాదింపను. ముక్కుకొనతో నీ ఛాతిని నేను చీల్చనులే. వెనక్కి రా! ఇంతలోగా సీతాదేవి భర్త శ్రీరామచంద్రుడు పర్ణశాలకు తిరిగి వస్తాడు. అప్పుడు నీవు, అతడూ పోరుసల్పండి. ఎవరు ఎవరిని జయిస్తారో తెలుస్తుంది"

జటాయువు మాటలతో మంచిదెబ్బకొట్టాడు. నీవు నిజంగా మగవాడే అయితే నిలు అని అనటంవల్ల నీవు ఒక పిరికిపంద అని బుజావవుతున్నదని అర్థం. పిరికివాడూ ఒకటే నీవూ ఒకటే అనేభావం స్పష్టంగా స్ఫురిస్తున్నది. ఈ పద్యం చక్కటి ఎత్తుగడతో సాగింది

ఇట్లా జటాయువు అనే మాటలను ప్రకృతిలో ఆకాశమంతా ప్రతిధ్వనిస్తోంది (185). నిజానికి కవి 'మహాకాశము ఖాతప్రకృతియు అనువదించుచుండె' అనటం వల్ల ప్రకృతి కూడా జటాయువు చెబుతున్న మాటలకు అంతరంగికంగా అంగీకారం చెబుతున్నదని భావం. బహిరంగంగా చెప్పాలంటే ప్రతిధ్వనిస్తున్నదని తాత్పర్యం.

## 2.2.2 జటాయువు రావణునితో తిరిగి పోరు సల్పటం :

రావణాసురుడు మాటలతో వినలేదు కనుక యుద్ధానికి తలపడ్డాడు జటాయువు. ఖగరాజు దానవేశ్వరుని ముందుకువెళ్ళి తన వాడి అయిన ముక్కుతోనూ, గోళ్ళతోనూ వాని పది తలలను, కంఠాలను గట్టిగా తన్ని, పొడిచి (తల వెంట్రుకలను=గిర్దా)ను, నగలను, శిరస్త్రాణాలను రాలిపడేటట్లుగా చేశాడు (186). అప్పుడు రావణాసురుడు పన్నెనిమిది చేతులతో పక్షిరాజును కక్కలదప్పి పిడాపెడా విదలించి దూరంగా తోసేశాడు (187). వెల్లకిలా పడిపోయిన గ్రద్దలరాజు పొర్లి పైకి లేచి రావణాసురుడిని పైకి రానివ్వకుండా దూరదూరంలో ఎగిరివస్తూ వాని శరీరాన్నంతా చీలుస్తూ దిక్కుతోచకుండా చేశాడు జటాయువు (188). ఇట్లా

ఒళ్ళంతా చీలుస్తూ ఉంటే తట్టుకోలేక రావణుడు తన ఇరవై చేతులతోనూ రక్షణగా పందిరి కట్టుతున్నాడు. పక్షిరాజు సానపెట్టిన కత్తులలాగా ఉండే ముక్కుకొసలతో రాక్షసుని చేతులకు అగాధమైన తూట్లు పొడిచాడు. దానితో వాని చేతులనుంచి ముక్కలు ముక్కలుగా చిరుకండలు రాలిపడ్డాయి (189). ఎంత ప్రయత్నించినా దానవేంద్రుని కంఠం పట్టుకొని మెడ విరిచేదానికి వీలుకాకుండా పది తలలు వరుసగా అటూఇటూ కోటకట్టినట్లుగా అమరి ఉన్నాయి. దీనికి తోడు చేతులతో పందిరి కట్టుతున్నాడు.

పత్త్రిరాజు పెద్ద పటుకారుతోఁ బట్టి
నట్లు దైత్యభుజమునందుఁ బట్టి
ముక్కుతోడ బట్టునొక్కి దానవు పది
కరము లొక్కసారి కత్తిరించె. (191)

తలకాయలను కత్తిరిస్తామంటే చేతులతో పందిరి కట్టుకొన్నాడు రాక్షసుడు. అందువల్ల ఖగరాజు రాక్షసబాహువుల్ని పెద్దపటకారుతో పట్టుకున్న రీతిగా గట్టిగా పట్టుకొని ముక్కుతో గట్టిగా నొక్కి, దానవుని పది చేతులను ఒకేసారి కత్తిరించేశాడు.

కత్తిరింపఁబడిన కరములు వెంటనే
పుట్టలోననుండి బుస్సుమంచు
లేచివచ్చునట్టి లేతహోనము లల
పడగ లెత్తివచ్చినట్లు వచ్చితోఁచె. (192)

అలా కత్తిరింపబడ్డ చేతులు వెంటనే పుట్టలోని రంధ్రంలోనుంచి బుస్సుమంటూ పైకి లేసివచ్చిన నాగుబాములలాగా - కత్తిరింపబడ్డ చేతులు వెంటనే సుళాసుళా మొలచుకొని వచ్చాయి.

ఆశ్చర్యంపడి ఖగపతి
నిశ్చలముగ నిలిచిపోయె నిజముగ నేమీ
యాశ్చర్యము! తల తునిగియు
దుళ్ళరితువ కితె మణులఁ దోచునె! యన్నగన్.
(193)

పక్షిరాజు ఆశ్చర్యపడి కొద్దిసేపు చలనం లేకుండా నిలిచిపోయాడు. 'నిజంగా ఏమి ఆశ్చర్యం! వీని తలలన్నీ తునిగిపోయి (ఖండింపబడి) కూడా మళ్ళీ పుట్టుకొని వస్తున్నాయే' అనుకున్నాడు జటాయువు.

పై రెండు పద్యభావాలనుబట్టి జటాయువు తన స్వశక్తితో రావణాసురుడి చేతులు, తలలు ఖండించాడన్న సంగతి మనకు తెలుస్తుంది. అదీగాక రావణాసురుణ్ని గజగజ వణకించాడు. ఈ పక్షి దెబ్బకు తట్టుకోలేక విల్లమ్ములు విడువడానికి కూడా చేతగాక ఆఖరికి రావణుడు ఇరవై చేతులను పందిరిగా చేసి కట్టుకున్నాడు. పక్షే కదా అని ఏరా పక్షీ! అన్నాడు చులకనభావంతో. కాని మన పక్షిరాజు తన బలమేమిటో తన సత్తా ఏమిటో నిరూపించుకున్నాడు రావణుని దగ్గర. నిజానికి ఇక్కడ జటాయువు రావణాసురుడిని జయించినట్టే లెక్క. ఎప్పుడైతే శత్రురాజు తల తెగిపోయిందో అప్పుడు ఓడింపబడ్డట్టే కదా! అయితే అయితే ఇక్కడ రావణాసురుడి కడుపులో అమృతభాండం ఉండడంచేత చేతులూ, తలలూ మొలిచాయి తప్ప లేకపోతే రావణాసురుడు దశరథుని స్నేహితుడైన గ్రద్ధరాజు చేతిలో ఓడిపోవలసినవాడే.

జటాయువు పాత్రను ఇంత ఉదాత్తంగా మలచిన విశ్వనాథ సత్యనారాయణ గారు ధన్యులు. ఎందుకంటే తనకు చేతగాకపోయినా సీతను ఎత్తుకుపోతుంటే చూసి ఊరకే ఉండలేక రావణాసురుడిని అడ్డగించలేదు. నిజంగా బలపరాక్రమ సంపన్నుడై ఎదిరించాడు. వయస్సు మళ్ళినప్పటికీ (కల్పాంతజీవి కదా!) ఇంత బలం ఉండి కూడా చెప్పే నీతులన్నీ ఆ రాక్షసునికి చెప్పాడు. నీ బంధుపరివారానికే చేటు అని కూడా చెప్పాడు-ఆఖరికి. వినకపోతే వాణ్ని కొట్టి బుద్ధి చెప్పాడు. అప్పుడు కూడా వినకపోతే వానిచేతులు, తలలు నిర్దాక్షిణ్యంగా ఖండించివేశాడు. అయితే వాని వరబలంచేత, అమృతభాండం ఉండడంచేత వాని చేతులు, తలలు తిరిగి మొలచాయి. ఎంత బలపరాక్రమసంపన్నుడయితే మాత్రం అలాంటప్పుడేమి చేయగలడు! ఈ విధంగా జటాయు పాత్రయొక్క మహౌన్నత్యాన్ని బాగా ప్రతిబింబించేటట్టు చేశాడు-కవి. మూలంలో కూడా వాల్మీకి మహాకవి జటాయువు చేసిన యుద్ధాన్ని, ఇతని గొప్పతనాన్ని తక్కువేమీ చెప్పలేదు. జటాయువు విజృంభించిన పద్ధతిని వాల్మీకి రామాయణంలో చేతులు మాత్రం ఖండించినట్లుగా ఉంది. అయితే ఇక్కడ విశ్వనాథవారు మరికాస్త ముందుకు

తీసుకెళ్ళారు పాత్రను. మూలంలో కూడా జటాయువు ఘాటికి తట్టుకోలేక రావణుడు గడగడ వణికినట్లుంది.

ఈ వణుకుడు పెదవులలో ఇంకా బాగా స్పష్టంగా కనబడింది.

**తన చేతులు తెగి వెంటనే మొలచినంత ఖశిరా జద్ది చూ**
**చిన యంతన్, తన యెద్దియో యొక యవిజ్ఞేయంబుగా నుండ నౌ**
**నని తానెంచు రహస్యముం దెలియగా నైనట్టివానిన్, వధిం**
**పను తీవ్రంబుగ నిశ్చయించెను నిలింపద్వేషి నీత్యుగ్రుడై. (194)**

తన చేతులు తెగిన తర్వాత వెంటనే రావణునికి తిరిగి మొలచిన విధానాన్ని చూసి పక్షిరాజు తునిగిన చేతులు ఇట్లా మొలవటానికి ఏదో తెలియని శక్తి ఉండ వచ్చునని ఊహించాడు. ఆ రహస్యమేమిటో తెలియకుండా వాణ్ణి వధింపలేనని గట్టిగా మనస్సులో నిశ్చయించుకున్నాడు జటాయువు.

రావణునికి ఇట్లాంటి శక్తి ఏదో ఉందన్న సంగతినైనా కనీసం నేను తెలుసుకున్నాను అది కూడా కొంత ప్రయోజనమే అనుకున్నాడు. తాను వాణ్ణి చంపలేకపోయినప్పటికీ ఈ రహస్య విచ్ఛేదనానికి ప్రయత్నించమని శ్రీరామునికి చెప్పినా కూడా చాలుననుకున్నాడు జటాయువు.

ఏ రెండు చేతులతో సీతను పరిగ్రహించి పట్టుకున్నాడో అవి వాడి ఇరవై చేతులలో ప్రధానమైన చేతులు. ఆ చేతులనుంచి జానకి విడిపోలేదని తెలుసుకొని జటాయువును మళ్ళీ దగ్గరకు రానిచ్చి తన చంద్రహాసఖడ్గాన్ని బయటకు పెరికి రావణుడు దృఢంగా దాన్ని పట్టుకొని జటాయువుతో మళ్ళీ ఇట్లన్నాడు (195)

**నిను మన్నించితి నింతదాఁక యిదిగో! నీఱెక్కలం గోసెదన్**
**నిను పాదంబుల యందునన్ నఱకెదనెన్ నీ చంచువుంద్రుంచెదన్**
**నను నెవ్వాఁడుగ నెంచితో విపులనానా దేవతాలోక నా**
**శనహేతూద్భుట ధూమకేతువ నుదంచద్రాక్షసాధీశుఁడన్. (196)**

"ఇంతదాకా నిన్ను మన్నించాను. ఇదిగో ఇప్పుడు చూడు- నీ రెక్కలు కోస్తాను; నీ పాదాలు నరుకుతాను; నీ ముక్కు తుంచుతాను నన్నెవ్వడనుకుంటు

న్నావో—విశాలమైన సకలదేవతల పాలిటా నాశనహేతువైన అగ్నిని, శౌర్య పరాక్రమంగల రాక్షసరాజును నేను" అన్నాడు రావణుడు.

నీ సొమ్మింతయు దొంగిలించితినె, యా నీ చెప్పురాముండు తా
నై సర్వాపగలుం బయోధియును నొక్కంజం దరింపం గలా
డో సౌరాధికమైన తేజముఁగలాడో అట్లె రానిమ్ము సం
త్రాసంబేటికి నీకు నీ నడుమ? వధ్యంబైన దుర్జాతికిన్. (198)

""నీ సొమ్మింతేమైనా దొంగిలించానా ? ఆ నువ్వు చెప్పే రాముడు తాను సకల నదులను, మహా సముద్రాన్ని ఒక్కంజలో దాటగలడా ? సూర్యునికంటే 'అధికమైన తేజస్సు కలవాడా ? అట్లే రానీ ! నీకూ నీ నడుమ బాధ దేనికి— వధార్హమైన మీ దుర్జాతికి!" అన్నాడు రాక్షసుడు.

నీ సొమ్మింత దొంగిలించానా అనటం ద్వారా రావణుని కసి ఎంత ఉందో తెలుస్తుంది. నీ సొమ్మేం పోయింది కనుక నన్నింతగా బాధపెట్టి అడ్డగిస్తున్నావని రావణుని వితండవాదం. నీ సొమ్ము కాదు కదా, నీకెందుకొచ్చిందని అతని వాదం. ఎవరికైనా తోటివారికి అన్యాయం జరిగినప్పుడు ఎవరైనా నిలదీసి అడిగితే నీకెందుకొచ్చిన తంటా ఊరుకో నీ సొమ్మేంకాదుగదా అనే లోకనైజాన్ని రావణుడిక్కడ చెప్పాడు.

అంతవాఁ డింత వాడని యతనిఁ గూర్చి
చెప్పఁగా వచ్చితివి కదా! సీతఁ గూర్చి
యుదిర! చెప్పవె యంత దింతదియటంచు
నీ వెఱుంగవు కాకోలు నీడజంబ! (200)

"అంతవాడింత వాడని మీ రాముణ్ని గూర్చి చెప్తూ వచ్చావు కదా! ఛురి సీతను గూర్చి అంతటిదీ యింతదీ అంటూ చెప్పవేమిరా! ఆమె గురించి నీకు తెలియదు కాకోలు నీడజమా!" అని దెప్పి పొడిచాడు.

ఇక్కడ 'నీడజమా (= గూటిలో పుట్టినవాడా=పక్షీ!) అనే సంబోధనలో పక్షి గూటిలో పుట్టినవానికి ఏం తెలుస్తుందిలే అన్న దెప్పి పొడుపు ఉంది. ఎంత సేపూ శ్రీరామచంద్రుడి దివ్యతేజస్సూ, శౌర్య పరాక్రమాలు చెప్తావేమిటని రావణుడి బాధంతా.

**2.2.3** రెక్కలు తెగిన జటాయువు - సీత దుఃఖం :

అకట నన్నెదిరించి యాహవము చేయు
మంచు నెవ్వండు చెప్పెనురా దురాత్మా!
నా రహస్యంబుతోడఁ బ్రాణములు నీవి
గుప్తపఱచితి నెగురుటకూడ దింత. **(203)**

వ. అని నేలపై యమయాతనంబడి పొరలుచున్న జటాయువుందరిసి సీత యిట్లని దుఃఖించె (204).

"ఆహా! నన్నెదిరించి ఆహవం (యుద్ధం) చెయ్యమని ఎవడు చెప్పాడురా దురాత్మా! నా రహస్యం నీ ఒక్కడివే కనుక్కున్నావు. కనుక, నీ ప్రాణాలు తీసి నా రహస్యాన్ని బహిర్గతం కాకుండా చేసుకుంటాను. నీవిక ఎగురకూడదు" అన్నాడు నిలింపద్వేషి అయిన రావణాసుర దుగ్రుడై (203). రావణాసురు డామాట అంటూనే ఆ కార్యం జరిగిపోయింది. వెంటనే తర్వాతి వచనంలో నేలపైన రెక్కలు తెగిపడి యమయాతనతో (మిక్కిలి బాధతో) పొర్లుతున్న జటాయువును చూసి సీత ఈ విధంగా దుఃఖించిం"దన్నాడు కవి (204).

మంచి దర్శకుడైనటువంటివాడు — రావణాసురుడు జటాయువుయొక్క రెక్కలు, చంచువు (ముక్కు), పాదాలు నరికాడని మొదలైన రీతిగా చెప్పడు. పాత్రద్వారా ఎప్పుడైతే ఆ మాట - ఆ పని చేస్తానని చెప్పించాడో వెంటనే దాని ఫలితంగా ఏర్పడిన దృశ్యాన్ని చూపించేస్తాడు ప్రేక్షకులకు. కథనంలో ఇదొక శిల్పం. మంచి దర్శకుడు ఒక సినిమా తీసినా అంతే. ఒక హీరో ఘాత ధృతమైన వాక్కులు అనిపిస్తాడు. తర్వాత వాడన్నమాటలు చేతలుగా మారి ... న దృశ్యాన్ని వెంటనే చూపిస్తాడు. అంతేగాని వాడు చేసే బీభత్సమంతా చూపిస్తూ కూర్చోడు దర్శకుడు. దర్శక శిల్పాలలో ఈ పద్ధతి అదొక తరహా శిల్పం. "నీ ప్రాణాలు తీసి ఈ రహస్యాన్ని నీతోనే గుప్తపరుస్తా"నన్నాడు రావణుడు. తన రహస్యమేమంటే చేతులు, తలలు ఖండింపబడినప్పటికీ అవి తిరిగి మొలుస్తున్నాయనే సంగతి శత్రువులకు తెలిస్తే తద్భేదనం చేసి (రహస్యాన్ని కనుక్కొని), తర్వాత నన్ను చంపుతారేమోననే భయం రావణాసురునికి అప్పుడే ఆ క్షణాన కల్గిందన్నమాట.

"ఓ కల్పాంత మహాజీవీ (జటాయువా) ! శ్రీరామచంద్రుని సతియొక్క దురవస్థను కళ్ళతో చూడలేక నీ విట్లయిపోయావా విహంగలీలాబంధూ ! (205)" అంటూ పలుపలు విధాలుగా సీతాదేవి దుఃఖించింది.

**అప్పటిదాఁకఁదా నధికుడై న జటాయువు తద్రహస్యమున్**
**ముప్పగ నంతలోఁ దెలిసిపోయిన నంతటి యల్పుఁ డౌటయున్**
**విప్పగరాని చిత్రములు, విశ్వసనీయత దాఁటిపోయెడున్**
**గుప్పన కూరలై చెడి కకుప్పలు నీరవభీతముల్ కటా. (214)**

అప్పటిదాకా జటాయువు రావణాసురుని కంటే ఎన్నో రెట్లు అధికుడయ్యాడు. అంటే అతని పరాక్రమ విజృంభణకు రావణుడు అల్పుడై పోయాడు. ఎప్పుడైతే ఈ రహస్యం (చేతులూ, తలలూ మళ్ళీ మొదలవటం) తెలిసిపోయిందో అంత పరాక్రమంగా పోరాడిన జటాయువు ఇంత అల్పుడై పోవడమనేది చిక్కు విప్పలేని విచిత్రం. జటాయు విలా అయిపోవటం విశ్వాసం కలగడంలేదు. అన్ని దిక్కులూ నిశ్శబ్దమైపోయాయి. చెడి కుప్పలుగా అతి భయంకరంగా పడిపోయాడు. జటాయు వయ్యో!" అని సీత విపరీతంగా దుఃఖించింది.

ఎంతో శౌర్యపరాక్రమాలతో భీకరంగా పోరాడుతూ జటాయువు రావణాసురుడు ధారావాహికంగా ప్రయోగించిన బాణాలను తట్టుకొని విజృంభించేటప్పటికి రాక్షసుడు బెంబేలెత్తి చేసేది లేక గజగజ వణుకుతూ చేతులతో పందిరి కట్టుకున్నాడు. చివరికి జటాయువు ఆ పందిరిని కూడా ఛేదించి చేతులను, తలలను ఖండించిపారవేశాడు. కడుపులో ఉన్న అమృతభాండం చేత తిరిగి వెంటనే చేతులు, తలలు మొలమకొని వచ్చాయి. అప్పుడు నిర్బలుడయ్యాడు జటాయువు. అంతదాకా రాక్షసుడు వణికాడు. ఎప్పుడైతే చేతులు, తలలు కొత్తవి పుట్టుకొచ్చాయో వాడికేమో కొత్తశక్తి వచ్చింది. జటాయువేమో రానురాను అలసిపోతున్నాడు. పండుటాకు రాలిపోయి కొత్త ఆకు మొలకెత్తి వచ్చినప్పుడు చెట్టు ఎంత పచ్చగా కళకళలాడుతుందో వానికి కొత్తచేతులూ, కొత్త తలలూ వచ్చేటప్పటికి రాక్షసునిలో కొత్త ఉత్సాహం వచ్చింది. ఇవతలి వ్యక్తి అయిన జటాయువుకేమో అలుపు తగులుతోంది కనుక రావణాసురుని శరీరభాగాలు తిరిగి మొలిచేటంతవరకూ జటాయువు చాలా అధికంగా పోరాడాడు. రావణునికంటే అధికుడనిపించుకున్నాడు.

ఈ విధంగా జటాయువు పాత్రను మూలంలోకంటే కూడా మరికాస్త ఉదాత్తంగా, పరాక్రమసంపన్నంగా వర్ణించారు విశ్వనాథవారు. అలాగని వాల్మీకి ఋషి జటాయువు పాత్రను, అతని శౌర్యాన్ని తక్కువగా చేసేసి చెప్పలేదు. కాకపోతే సత్యనారాయణగారు ఆ పాత్రను మరింత ఔన్నత్యంగా (హైలైట్) మలిచాదన్నది మనం గుర్తించాల్సిన విషయం.

ఇక్కడ మనం జటాయువును గురించి ఇంకో విషయం చెప్పుకోవాలి. పైగా జటాయువు దశరథుని ప్రాణమిత్రుడు కనుకనే సీతాదేవి అపహరణను తీవ్రంగా ప్రతిఘటించాడు. విశ్వనాదవారు ఈ జటాయువు పాత్రను బాలకాండం (ఇష్టిఖండం)లో దశరథుడు పుత్రకామేష్టి సందర్భంగా అశ్వమేధయాగం చేసే టప్పుడు ప్రవేశపెట్టారు. ఆ సంఘటన ఈ సందర్భంలో చెప్పుకోవడం సమంజసమే. దశరథునికి — జటాయువుకు గల ప్రేమానురాగాలు, స్నేహితుల హృదయాలు, పైగా ఒక పక్షికి, మనిషికీ అందులోనూ సార్వభౌమునికి మధ్య కుదిరిన స్నేహం, సుహృద్భావంతో కూడిన వారి చేష్టలను, వారి సంభాషణను విశ్వనాథ సత్యనారాయణగారు మానవీయ సంబంధాలు ఉట్టిపడేటట్లు అభివర్ణించారు. ఇక చూడండి.

## 2.3 అశ్వమేధయాగంలో దశరథ - జటాయువుల కలయిక :

దశరథమహారాజు, ఆయన పరివారమంతా యజ్ఞవాటిక సిద్ధంచేసి ఉండే సమయంలో జటాయువు ఆకాశమార్గాన ఆ యాగానికి వస్తాడు. ఆకాశాన ఆయన రావటం ఇలా ఉంది.

**అంతట నొక్కనాఁడు గరుదంచల చంచల మారుతచ్ఛటా**
**క్రాంతమహాగ్నియై వియ దుదారగతిన్ జనుదెంచి రమ్య ప**
**క్షాంతములైన నీడగమి యార జటాయువు గాఢనేమి మ**
**ద్భ్రాంతిఁ జరింప మింట వసుధాపతి కాఁదలయెత్తి చూచుచున్.**
(బాల. ఇష్టి. 343)

రెక్కల అంచుల కదలికలవల్ల విస్తృతమైన గాలి ప్రచండమైన అగ్నిలాగా ఆకాశంలో గంభీరంగా వ్యాపించేటట్టుగా రమ్యమైన రెక్కలతో కూడిన జటాయువు

ఆకాశంలో వస్తూ ఉండి— బ్రహ్మాండమైన రథం ఆకాశంలో సంచరిస్తూ ఉండా అన్న భ్రాంతిని గొల్పడంతో దశరథమహారాజు పైకి తలయెత్తి చూశాడు.

**ఎన్నన్ నీవ జటాయువా? సఖుఁడ! రా! యెన్నాళ్ళ కెన్నాళ్ళకీ**
**నన్నున్ లోనఁ దలంచినావు కబు రందజేసిరా నీకునున్**
**మిన్నున్ దిగ్గుము నీవు వచ్చితివి నా మేధంబు సాఫల్యమం**
**దున్నితున్ గబురంపుట దగున్ సుమంత్రుండున్ సుమంత్రుండుగా.**
**(344)**

పైకి తల ఎత్తిచూసిన దశరథుడు మిత్రుని గుర్తించి నీవా జటాయువా? మిత్రమా! రా! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు నీ మనసులో నన్ను తలచుకున్నావు! నీకు సకాలంలో కబురందజేశారా మా వాళ్ళు. ఆకాశం నుంచి దిగు. నీవు వచ్చావూ, నా అశ్వమేధయాగం సఫలమయింది. నీకు సకాలానికి కబురందజేసిన మా ముఖ్యమంత్రి అయిన సుమంత్రుడు నిజంగా సుమంత్రుడు (సుబుద్ధి గల – మంచి మంత్రి) అనిపించుకున్నాడు.

నీవా జటాయువా! అని అనటంలో నేను ఏదో ఘనమైన రథమను కున్నాను. మిత్రుని గుర్తుపట్టేటప్పటికి నీవా జటాయువాఅన్నాడు. ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు నన్ను జ్ఞప్తికి తెచ్చుకున్నావు అనటంవల్ల వీళ్ళమధ్య ఎడబాటు చాలా కాలమయిందని తెలుస్తుంది. చాలాకాలం మళ్ళీ కలుసుకో లేదు. చాలా కాలం కలుసుకోని స్నేహితుణ్ణి కలుసుకున్నందుకు చాలా ఆనంద సంభ్రమాలు రోజులో కలిగాయని అర్థమవుతుంది. నీవు ఎప్పుడైతే వచ్చావో నా అశ్వమేధమప్పుడే సఫలమయింది అనటం ద్వారా సఖుడైన పక్షిరాజును ఎంత ఆప్యాయంగా పలకరించాడో వర్ణనాతీతం. తన సంతోషాన్ని తట్టుకోలేక కబురందజేయడంలో కృతకృత్యుడైన తన ప్రధానమంత్రి అయిన సుమంత్రుణ్ణి మెచ్చుకోలేకుండా ఉండలేకపోయాడు రాజు. ఒక పక్షికి రాజుకు మధ్య జరిగిన ఈ సంభాషణ ద్వారా ఎంత మానవీయ సంబంధం తొణకిసలాడుతున్నది ! పక్షి ఏమిటి ! రారాజుతో స్నేహమేమిటి! ఇంతకంటే సామాజిక వ్యవస్థ ఏముంటుంది? మనుషులు మనుషుల్ని సమభావంతో చూసుకోలేక ఒకరికొకరు అర్థంచేసుకోలేక ఇబ్బందిపడుతుంటారు, ఇంతకంటే సోషలిజం ఏముంది! స్థిర స్నేహం అవధుల్ని

దాటిపోయింది. ఇంకా పక్షిరాజుకు దశరథ మహారాజు స్వయంగా చేసే సేవలు అనండి లేదా అతిథి మర్యాదలు అనండి చూడండి.

అనడిగిన పక్షిరాజున
కును ఱెక్కలు నిమిరి చుంచుకొన దాఁది నినున్
నినుఁ గంటిని స్నేహావధి
నని ఫలముల నారగింప నందిచ్చు తఱిన్. (345)

దశరథుడు పక్షిరాజుకు ఆప్యాయంగా రెక్కలు నిమిరి తోకదాకా తన చేతులతో స్పృశిస్తూ పాదినాడు. తర్వాత ప్క్నోటికి (ముక్కుకు) పళ్ళు అందించాడు మహారాజు.

నాకమునందు యుద్ధముల నాడఁగఁబోయెడు రాజుతోడ మై
త్రీకలనన్ వహింతు రెవరేనని యందున దీర్ఘ పక్షచం
చూకృత దారణాత్తరిపుశుష్మ్మదు నీతఁడు మిత్రుఁడౌట లే
దేకద యబ్బురంబని వహించిరి యబ్బురమున్ సభాసదుల్. (346)

ఆ సమయంలో (పక్షికి రాజు ఫలాల నందిస్తున్న విధానాన్ని చూసి) 'ఆకాశంలో యుద్ధంచేసే రాజులతోనైతే ఎవరైతే ఎవరైనా మైత్రి (స్నేహం) చేస్తారు కాని అందులోనూ సుదీర్ఘమైన అత్యంత పొడుమైన రెక్కలు గలిగినటు వంటివాడూ: శత్రువులను చీల్చి చెండాడటానికి యోగ్యమైనటువంటిది, గట్టిదీ, పొడుమైనటువంటి ముక్కుగలవాడూ అయిన ఇతడు (జటాయువు) మిత్రుడవటం అనే ఈ వింత ఎక్కడా లేదుకదా' అని సభాసదులందరూ ఆశ్చర్యంలో మునిగి పోయారు (నోళ్ళు తెరచుకున్నారు).

ఇక్కడ విశ్వనాథవారు కడు రమణీయమైన దృశ్యాన్ని కనులకు కట్టినట్లు చిత్రీకరించారు. పక్షిని ఆప్యాయంగా జుట్టునుంచి తోకదాకా (రెక్కలకో కలుపు కొని) పాది నిమరటం: రాజే పళ్ళు స్వయంగా తానే తినిపించటం ఎంత సుందరంగా ఉంటుంది! పరిచారకుల ద్వారా రాజు ఆ కార్యాన్ని ఏర్పాటుచేసి ఉండవచ్చు. కాని తాను స్వయంగా తినిపిస్తే తప్ప దశరథునికి తృప్తి కలుగదు. అందుకే ఆ

పనికి ఎవరినీ నియమించకుండా అతనే చేశాడు. వాళ్ళ స్నేహబంధం అటువంటిది. ఈ దృశ్యాన్ని చూసి సభాసదులకు కూడా సంభ్రమాశ్చర్యాలు కలిగాయి. వీళ్ళిద్దరి స్నేహానికి సభాసదులే (యజ్ఞానికి వచ్చిన మిగతా రాజులు) పరవశించిపోయారు.

పళ్ళను పక్షిరాజు ఆరగిస్తూ ఉండగా ఆ రాజు జటాయువుతో "తాతా! నాకు నీ స్నేహమొక ఎత్తు, అమరేంద్రుని స్నేహమొక ఎత్తు" అన్నాడు. అప్పుడు పక్షిరాజు రెక్కలు తుదిదాకా ముడుచుకొని దశరథునిలో ఈ విధంగా అంటున్నాడు (347).

**నేనొక పక్షిమాత్రుఁడను నీ వఖిలేశుఁడ విట్లు నన్నుఁ బ్రే**
**మానత బుద్ధిఁ గాంతువు ధరాధిపా! నీవన నాదుమైత్రికిన్**
**గానను హద్దు నీ వితుల గౌరవమాడినయంతఁబొంగి నా**
**లోనన నేను గ్రొమ్మనసులోఁ బులకించుచు నుంటి మిత్రమా !**
**(348)**

"నేనొక పక్షిమాత్రుడను, నీవేమో అఖిల సామ్రాజ్యాధిపతివి. ఇలా నన్ను ప్రేమాభిమానంతో చూసుకుంటున్నావు రాజా! నీవంటే నా స్నేహానికి హద్దు నెరుగను. నీవిట్లా నన్ను గౌరవిస్తూ ఉంటే నాలో నేను మనస్సులో మిక్కిలి పులకించిపోతున్నాను మిత్రమా!" అన్నాడు జటాయువు.

రాజు చేసిన మర్యాదపూర్వకమైన కార్యానికి పక్షిరాజు కొత్తగా పులకించి పోయాడు. దశరథుడంటే జటాయువుకు తన మైత్రికి హద్దు తెలియదు జటాయువంటే దశరథునికీ అంతే.

**ఈ మిషవెట్టి వచ్చితిని యెంతటికెంతటి కెంతదూర మీ**
**భూమి నినున్ గనుంగొనఁగఁ బుత్రులు గల్గుదురయ్య నీకు నే**
**నా ముని కూనలన్ గనుదునా? కనుఁగొన్నను గుర్తుపట్టువా**
**రే! మఱి నీ కుమారు లని యించుక చంచువు వాల్చి నవ్వుచున్.**
**(349)**

జటాయువింకా అంటున్నాడు "ఈ క్రతువు (యజ్ఞం) నెవంతోనైనా నిన్ను చూడటానికి ఎంతెంతటి దూరం నుంచి ఈ పోటికి వచ్చాను. పుత్రులు పుడతారు

లేవయ్యా నీకు! నేను ఆ మునివరనందనుని (పసిపిల్లలను) చూస్తానా! ఒకవేళ నేను చూసినా మరి నీ కుమారులు నన్ను గుర్తుపడతారా!" అని జటాయువు కొంచెం చంచువు (ముక్కు) వాల్చి నవ్వుతూ అన్నాడు.

జటాయువు దశరథునికి పుత్రులు పుడతారు లేవయ్యా అన్నాడు. దశరథుడు అందుకోసమే క్రతువు చేస్తున్నాడు. తాను కోరుకున్నది నెరవేరుతుంది లెమ్మని మిత్రునికి చెప్తున్నాడు. శ్రేయోభిలాషి అయిన మిత్రుడు కదా జటాయువు. అందుకే ఆ మాట అన్నాడు. నీకు పుత్రులు కలుగుతారు, వాళ్ళు నన్ను గుర్తుపడతారా అనేటప్పటికి జటాయువుకు సంతోషమెక్కువై కొంచెం నవ్వు వచ్చింది. దశరథుని పుత్రులను తలచుకొనేటప్పటికి ఆయనకంత నవ్వు వచ్చింది. ఆ జటాయువు సంతోషం అలాంటిది. ఆ నవ్వటం కూడా ఇంచుక చంచువు (ముక్కు) వాల్చి నవ్వుతున్నాడట. ఎంత రమ్యమైన సంభాషణ! జటాయువు తాను అంటున్న మాటలతో ఎంత తాదాత్మ్యం చెందాడు! ఆయన ఆనందం పట్టరానిది. ఆ స్నేహానికి కొలమానం లేదు. హద్దులసలే లేవు.

తన పక్షాంచలమారుత
మున తేనికి వీవఁ జాలుపో! నీవా ? నా
కును వీతు వంచు దశరథ
మనుజేశ్వరుఁ డతని వీచె మలువసనమున్. (350)

తన రెక్కల అంచులతో రాజుకు గాలి విసిరాడు జటాయువు. అప్పుడు దశరథుడు "చాలు చాలు నీవా నాకు గాలి వీస్తావు!" అని జటాయువుకు తన ఉత్తరీయంతో గాలి విసరాడు రాజు.

ఇక్కడ మిత్రులిరువురూ ఒకరికొకరు గాలి విసరడంలో పోటీపడ్డారు. అంతదూరం నుంచి వచ్చావు కనుక నేనే నీకు గాలి విసరాలి. నీవు విసరడం భావ్యం కాదని దశరథమహారాజు వాదం. (ఇవన్నీ స్పష్టంగా పద్యంలో ఉండవు పద్యం ఒడుపును బట్టి సహృదయుడైన పాఠకుడు కవిమనసు గ్రహించాలి. పాఠకుడు పెరిగేకొద్దీ భావజగత్తు పెరుగుతూ ఉంటుంది). క్రతువులో అన్ని పనులను చూసుకునేటప్పటికి దశరథుడు అలసిపోయి ఉంటాడు కనుక జటాయువు తన రెక్కలతో గాలి విసిరాడు. స్నేహితులిద్దరికీ ఒకరి మీద ఒకరికి ఎంత

వల్ల మాలిన అభిమానమో ఈ దృశ్యాన్ని విశ్వనాథవారు ఎంత సుందరంగా తీర్చిదిద్దారు!

ఉండుమని యెంత బలవంతమో పొనర్చె
రాజు మీ మానవులకు నా రాక యొకఁడె
వేగు నిలుచుట కాదని వెడలె నతఁడు
రాజునకును గన్నీళ్ళపర్యంత మయ్యె. (351)

జటాయువును ఉండిపొమ్మని రాజు ఎంతో బలవంతం చేశాడు. "మీ మానవులకు నా రాక ఒక్కటే బరువౌతుంది. ఇక్కడ నిల్వటానికి కాదని జటాయువు తిరుగు ప్రయాణానికి బయలుదేరాడు. రాజుకు కూడా కళ్ళనిండా నీళ్ళు వచ్చేశాయి-జటాయువు వీడిపోతున్నందువల్ల 'రాజునకును కన్నీళ్ళపర్యంత మయ్యె రాజునకు అని సముచ్చయం ఉండటం వల్ల జటాయువుకు ముందుగానే కళ్ళనీళ్ళు సుళ్ళు తిరిగాయి. అయినా పోక తప్పదు కనుక ప్రయాణం కట్టాడు జటాయువు.

పోవుచున్న పక్షిపుంగవుతో నేగి
యజ్ఞవాటిదాఁక నవనిపతియుఁ
బట్టణమ్ము దాఁకఁ బంపె సుమంత్రుండు
నెగిరి యేగె నంత ఖగశతారి. (352)

పోతూ ఉండే పక్షిరాజు వెంట దశరథమహారాజు యజ్ఞవాటిక దాకా వెళ్ళాడు. ఆ తర్వాత పట్టణమ్ము చివరిదాకా వెంటవెళ్ళి పక్షిరాజును పంపించాడు సుమంత్రుడు అక్కడి నుంచి ఖగరాజు పైకెగిరి వెళ్ళిపోయాడు.

యజ్ఞవాటికదాకా వెళ్ళి రాజును విడిచిపెట్టాడు పట్టణం చివరిదాకా వెళ్ళి సుమంత్రుడు విడిచిపెట్టి వచ్చాడు. దశరథుడు మిత్రుని సాగనంపటంలో ఎంత మర్యాద పాటించాడు పక్షే కదా! అక్కడి నుంచే ఎగిరిపోగలడు. అయినా అలా చెయ్యలేదు. మర్యాద మర్యాదే. మనుషులకు ఏ మర్యాదను పాటిస్తామో పక్షిరాజుకూ అదే మర్యాదను పాటించడం ఇక్కడ గమనించవలసిన విషయం.

పక్షిరాజు కూడా వీళ్ళ తన వెంట వచ్చేటప్పుడు రెక్కలతో ఎగిరిపోకుండా కాళ్ళ తోనే నడచాడు. పట్టణం దాటిన తర్వాత పైకెగిరి తన దారిని తానుపోయాడు — జటాయువు. అదీ దశరథ-జటాయువుల స్నేహం.

## 2.4 రామలక్ష్మణులకు జటాయువు దర్శనం :

సీతాదేవిని రామలక్ష్మణులు వెదక్కుంటూ వస్తున్నారు.

**అని దూరంబునఁ బర్వతోపముగా, నాకారతః పక్షిగాఁ**
**గనిపింపన్ రఘుదేవు తమ్ముఁడు నెఱుంగన్ దీని నిచ్చోటనాన్**
**వనజాక్షుండు శరంబు దీసి తొడివెన్ బాణాసనంబందునన్**
**దనుజ క్రూర విచిత్ర శాంబరకళాదర్పంబుగా నెంచుచున్.**

**(శబరిఖండం. 158)**

రామలక్ష్మణులు సీతాదేవిని వెదక్కుంటూ వస్తుండగా దూరంలో పర్వత మంత ఆకారంగల పక్షిని లక్ష్మణుడు చూశాడు. ఇది కూడా దానవుడు కళా నైపుణ్యంతో ఏర్పరచిన క్రూర విచిత్ర దానవమాయలేమో అనుకొని శ్రీరాముడు వెంటనే బాణం తీసి విల్లుకు సంధించాడు.

**ఓయీ! నాయన! నేజటాయువను బాబూ! యన్న దీర్ఘ స్వరం**
**బా యాకాశపథంబునన్ విరిసె నాస్యానం ద్విగ్దుఃఖగ్రే**
**ఖాయత్తుల్ పరువెత్తి యిద్దఱును స్నేహాంభోధిఁ బక్షీంద్రుఁ బ్రా**
**ణాయావ్యయు, ఛిన్నపక్షయుగునిం దర్శించి, రాత్మీయునిన్.**

**(159)**

అంబును విల్లుకు సంధించిన శ్రీరాముణ్ని చూసి జటాయువు "ఓయీ నాయనా! నేను జటాయువను బాబూ" అని దీర్ఘ స్వరంతో (పెద్ద స్వరంతో) ఆకాశంలో ప్రతిధ్వనించేటట్లు అన్నాడు. రామలక్ష్మణు లిద్దరూ దుఃఖంతో నిండిన ముఖాలతో అక్కడికి పరిగెత్తిపోయి సముద్రోపేతమైన స్నేహభావం గల పక్షిరాజు అయినటువంటి, ప్రాణాన్ని కొన ఊపిరితో నిలుపుకొన్నటువంటి, రెక్కలు తెగిపడి ఉన్నటువంటి, ఆత్మీయుడైనటువంటి జటాయువును దర్శించారు.

"ఓయీ నాయనా నే జటాయువును బాబూ!" అన్న దీర్ఘ స్వరంతో అరిచాడం చే శ్రీరామచంద్రుణ్ని దర్శించడంలో జటాయువుకు గల ఆదుర్దాతోపాటు

తానెవరికోసం ఎదురుచూస్తూ ఉన్నాడో వారిక్కడికీ తన ప్రాణముండే లోగానే రావటం అంతటి శరీరబాధలోనూ ఒక విధమైన సంతోషమే కలిగింది. దానికితోడు శ్రీరాముడు విల్లమ్ముల నెక్కుపెట్టాడు కనుక ఆబాణమే తనకు తాకి నట్లయితే శ్రీరాముడితో మాట్లాడక మునుపే తన ప్రాణాలు పైకి పోతాయి. ఇన్ని దినాలూ తాను కొనఊపిరిని నిలుపుకున్న శ్రమ వృథా అవుతుంది. అందుకే అంత గట్టిగా అరిచాడు.

శ్రీరామలక్ష్మణులు జటాయువు దగ్గరకు వచ్చి "తాతా నీకు ఈగతి ఎలా పట్టింది ? జగత్తత్త్వజ్ఞుడైన నిన్ను ఎవ్వడిట్లా చేశా" డంటూ కళ్ళొత్రజేశారిద్దరూ. తాతా! అని ఒక్కసారిద్దరూ బాధతో పిలిచారు, "రాఘవా! సీతను రావణుడు తీసుకుపోతున్న సమయంలో ఆ హృదయంలేని రావణాసురుణ్ని నేను మహా శౌర్యంతో అడ్డగించాను (160). వాని సారథిని నా బలమైన ముక్కుతో ఆమూర్ధ మూలాధారమూ దిగబడేటట్టు కొరత వేశాను. రథచక్రాలను, ఇరుసును, నొగలను విరిచిపారేశాను. రెక్కలతోనూ, ముక్కుతోనూ వాడి శరీరమంతా చీల్చి విసావిసలు చేశాను (161) వాని శోభాయమానమైనదంతటినీ నేను చిందరవందర చేసి విడిచిపెట్టాను. వాని తల, బాహువులు (చేతులు) ఖండించాను. వాని కిరీటమూ, మణిహారాలు సర్వమూ సులువుగా ఊడ్చి పెట్టాను. వాటినంతటినీ వచ్చేదారిలో మీరు చూస్తే ఉంటారు కదా! ఆ మూర్ఖుడు ఆ సతిని దొంగిలిస్తూ నన్నిట్లా చేసి వెళ్ళాడయ్యా! (162) రామా! నీవెవ్వరో స్పష్టంగా చెప్పావయ్యా! ఆ రాక్షసునికి నీ గుణగణాలెన్ని చెప్పినప్పటికీ మనసుకెక్కలేదు సుమా! ఈ దుష్టమార్గంవల్ల మహాభయంకరమైన నీ పరాక్రమానికి ధ్వంసమై మరి వాడేమవు తాడో వానికే తెలుస్తుందిలే" అని జటాయువు అంటూ సొమ్మసిలి పోయింది (163)

అలా సొమ్మసిల్లిన జటాయువుకు లక్ష్మణుడు ఆకుల బుట్టలో నీళ్ళు తెచ్చి నాలుకను తడుపుతున్నాడు. ఆ సమయంలో శ్రీరామచంద్రుడు కళ్ళనీళ్ళురాలుస్తూ ఈ విధంగా అనుకున్నాడు (164). "దురదృష్టమంటే నాదే. నా తండ్రి గతించిపోయాడు; భార్యను దుర్మార్గుడెవ్వడో అపహరించుకుపోయాడు, రాజ్యము విడిచిపెట్టి ఇవతలబడ్డాను; అలఘు శరీరం (కొండంత పెద్ద శరీరం) గలవాడై నటువంటి ఈ పక్షిరాజు జటాయువు ఇట్లయిపోయాడు" అనుకుంటూ ఉన్న (166) రాముణ్ని-జటాయువుకు స్పృహ వచ్చి చూశాడు. జటాయువుకు స్పృహరావడంలో రఘురాముడు అతన్ని తన తొడపై చేర్చుకొని ఈ విధంగా అంటున్నాడు.



ఓపంగల్గుదువేని చెప్పఁగదవే యో తాత! ఆయేలొకో
నాపై నా పగ, వానికిన్ దెలియగా, నాసీత మీ కోడ, లా
యాపద్వార్నిధి మున్గి యేమనియెఁ దా నారీతి జీవించియు
న్నే! పద్మాననఁ గాంచినన్ బ్రదుకు నట్లేమైనఁ గన్పించెనా (167)

"ఓర్చుకొని చెప్పగలిగేటట్లయితే చెప్పవే తాతా! వానికింత పగ నాపై యెందుకో తెలియదు. ఆ ఆపత్సముద్రంలో మునిగిన మీ కోడలు సీత ఏమన్నది? తాను నిజంగా ఆ విధమైన కష్టంలో కూడా జీవించి ఉంటుందా! ఆ సీత ముఖాన్ని ఇట్టి చూస్తే బ్రతికేటట్లేమైనా కనిపించిందా!" అని జటాయువు నడిగాడు రాముడు.

జటాయువు సమాధానం.

అనిన జటాయువు వోయి శిశువా! జగతీతలమెల్ల నాశచే
మనును, నిరాశ పొందుటకు మానిని భర్త యదేమి! వాఁడు నె
ట్టన వనరాసులం బిడికిటం గొను, గొండలు నేలమట్టముం
బొనరుచు, సీతకుం భయము పుట్టదు ప్రాణములం దృజింపగా. (169)

"ఓయీ బిడ్డా! ఈ జగత్తంతా ఏదో ఆశచేతనే జీవిస్తూ ఉంటుంది. నిరాశ పొందటానికి ఆమె భర్త ఏమైనా సామాన్యుడా, అతడు (శ్రీరాముడు) వనసమూహాలన్నిటిని పిడికిలితో తీసుకోగలడు. కొండలను నేలమట్టం చేయగలడు. కనుక ప్రాణత్యాగం చేయవలసిన భయం సీతకు లేదు (ఆ అవసరమామెకు లేదు)" అని జటాయువు శ్రీరామచంద్రుణ్ణి ఓదార్చాడు.

రఘురాముడు మళ్ళీ అడుగుతున్నాడు.

మరి రఘురాముఁ డిట్లనియె, మామక మే యపరాధ మొప్పి దు
ష్కరణము చేయఁబూన్చిన దసాధుని వానిని, వాని వృత్త మే
వరణిది? వాని బంధుజనసంపద యెట్టిది? వాని నిల్చు ను
త్స్వర మెటనున్న? దున్న కొనప్రాణము వీడకమున్న చెప్పవే! (170)

"మేము చేసిన అపరాధమేమిటని ఈ దుష్కార్యం చేశాడు వాడు. వాని వృత్తాంతమేమి ? వాని బంధుజన మెంత ? వాళ్ళు ఎలాంటివాళ్ళు ? వాడు ఎక్కడ నివసిస్తున్నాడు మొదలైన వివరాలు ఉన్న కొనప్రాణం విడువక ముందే చెప్పవే తాతా" అని అడిగాడు రాముడు.

## 2.5 జటాయువు మరణం - దహన సంస్కారం :

రాముడడిగిన ప్రశ్నకు జటాయువు "వాడు (సీతను అపహరించిన వాడు) విశ్రవసుని కొడుకు, సాక్షాత్తు వైశ్రవణుని (కుబేరుని) సోదరుడు........" అని చెప్తూ ఉండగానే జటాయువుకు కాళ్ళు బిగుసుకొని నిగుడుకొని పోయినాయి. అలాగే రాముని తొడ మీదనే తల వాల్చేశాడు (171). దానితో ఇద్దరు సోదరులూ (రామలక్ష్మణులు) "అమిత నిష్కల్మషమైనవాడూ; అపరిమితమైన అవ్యాజాను రాగం గల్గినవాడూ, పూజ్యుడూ, మా తండ్రి స్నేహితుడైన జటాయువు ఇట్లా గతించిపోయెగదా" అంటూ గొల్లుమని ఏడ్చారు (172).

**ఏ వనదేవతల్ నినకులేశ్వరి మైథిలి యేడ్చుచుండగా**
**దీవలుచెట్లు నిశ్చలతఁ దేలగ నివ్వెఱపోయి నిల్చెనో!**
**ఆ వనదేవతల్ రఘుమహాన్వయరత్నము లిట్టు లేడ్వఁగా**
**ధీవలఁ జెట్ల పూవులు విదిర్చి ప్రశంసలు చేసె నూఁగుచున్.**
**(173)**

ఏ వనదేవతలు చూస్తూ ఉండగా ఇనకులేశ్వరి అయిన మైథిలి (సీత) ఏడుస్తూ ఉన్నప్పుడు చెట్లన్నీ ఒక్కసారి నివ్వెరపోయి నిశ్చలంగా నిలిచాయో— ఇప్పుడు అదే వనదేవతలు చూస్తూ ఉండగా రఘువంశ రత్నదీపాలైన రామలక్ష్మణులు ఇలా ఏడుస్తూ ఉంటే చెట్లన్నీ తమ పూలను విదిల్చి ఊగుతూ ప్రశంసించాయి.

సీతాదేవి ఏడ్చినప్పుడు చెట్లు నిశ్చలంగా నిలిచిపోవడమేమిటి? రామ లక్ష్మణులు ఏడుస్తున్నప్పుడు పూలను రాల్చి ప్రశంసిస్తూ ఊగడమేమిటి ? అప్పుడు కదలలేదు. ఇప్పుడు కదలుతున్నాయి. దుఃఖపడ్డ సోదరులు క్షత్రియులై జృంభిస్తారన్న సంగతి వనదేవతలకు తెలుసు.... . పైగా జటాయువు [illegible]

